# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## త్రిమూర్తి దేవుడు

రచన: వసుంధర

## రాకాసి వేళ్లు

రచన: కె. వి. యస్. యన్. మూర్తి

## బకాసుర వధ

రచన: వి. యస్. రావ్

రాక్షస వేట — ఏడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—177
సెప్టెంబరు, 1988
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1.

# త్రిమూర్తి దేవుడు

## వసుందర

ఊరికి కాస్త దూరంగా వున్న ఆలయమది. ఆలయంలోని విగ్రహం బ్రహ్మ విష్ణు మహేశ్వరులను ప్రతిబింబింపచేస్తూండడం వల్ల అంతా ఆ దేవుణ్ని త్రిమూర్తి దేవుడంటారు.

ఆలయానికి ప్రచారమూ, పలుకుబడీ తక్కువ. నరసింహమూర్తి అనే ఒక పూజారి సంరక్షణలో నడుస్తోందా ఆలయం. నరసింహమూర్తికి పూర్తిగా ఆలయం మీదనే ఆధారం. ఆయనది మరీ పెద్ద కుటుంబం కాకపోవడంవల్ల ఆలయంమీద వచ్చే ఆదాయంతో రోజులు బాగా గడిచిపోతున్నాయి.

ఆలయానికో ధర్మకర్త ఉన్నప్పటికీ పేరుకుమాత్రమే! ఆలయానికి ఆదాయం అంతంతమాత్రం. త్రిమూర్తి దేవుడికి మాన్యాలు లేవు. నగలు, ఆభరణాలు లేవు. అందుకని ధర్మకర్తకు ఆసక్తి లేదు.

అసలా ఆలయమొక పురాతన మందిరంలా పాడుబడి

ఉంటే నరసింహమూర్తి తాత గుర్తించి స్వంత డబ్బు
లతో ప్రాంగణాన్ని బాగుచేయించి రోజూ దేవుడికి
అర్చన చేయనారంభించాడు. ఆయన కాస్త కలిగినవాడు.
తర్వాత ఆస్తి కరిగిపోతే కొడుక్కదే జీవనాధార
మయింది. ఇపుడు నరసింహమూర్తికి అదే జీవనాధారం.
ఆయనకో అబ్బాయి, అమ్మాయి. తన తర్వాత వేరెవ్వరికీ
ఆ ఆలయం జీవనాధారం మాత్రం కాకూడదని నరసింహ
మూర్తి కోరిక.

ఆలయానికి నిత్యం వచ్చే భక్తులలో ఇప్పుడు గోవింద
రావున్నాడు. ఆయన పోలీస్ ఇన్‌స్పెక్టర్.

రెండు సంవత్సరాల క్రితం ఓ కేసులో ఆయనకు
విచిత్రమైన దొంగ తటస్థపడ్డాడు. వాడు క్షణక్షణానికీ
వేషాలు మార్చేసేవాడు. మారు వేషంలో వాణ్ని
గుర్తించడం బ్రహ్మరుద్రులకూడా సాధ్యపడేదికాదు.
ఆ దొంగ బాగా హై లెవల్లో వాళ్ళ రహస్యాలు
తెలుసుకుని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. వాణ్ని పట్టుకో
మని మంత్రులు, ఎమ్మెల్యేలనుంచి ఒత్తిడి వచ్చింది.
వాణ్ని పట్టుకోలేకపోవడంవల్ల ఉద్యోగం పోగొట్టు
కోవడమో, మన్యప్రాంతాలకు బదిలీఅయి వెళ్ళడమో
తప్పని పరిస్థితి కొందరు పోలీసాఫీసర్ల కేర్పడింది. వారిలో
ఇన్‌స్పెక్టర్ గోవిందరావొకడు.

గోవిందరావు చేయవలసిన మానవ ప్రయత్నమంతా
చేశాక ఆ దొంగను పట్టుకోవడం తన తలకు మించిన
పని అని గ్రహించి దైవభక్తిని పెంపొందించుకున్నాడు.
ఆ విధంగా ఆ ఊళ్ళో ఉన్న ప్రతి గుడినీ అతడు
దర్శించాడు. అప్పుడే త్రిమూర్తి దేవుడి ఆలయానికి
వెళ్ళాడు.

ఆ ఆలయంలో గోవిందరావుకో అపూర్వానుభవం కలిగింది. పూజారి నరసింహమూర్తి అతణ్ని గర్భగుడిలోకే వెళ్ళనిచ్చి వీడననిచ్చాడు. అది తీసుకుని దేవుణ్ని సేవించడంతో తృప్తిపడక గోవిందరావు విగ్రహానికి సాష్టాంగపడ్డాడు. అలా చేసినప్పుడతడి చేతికొసలకు భగవంతుడి పాదాలు తగిలాయి. ఆ విగ్రహంలోంచీ యేదో శక్తి అతణ్ని వచ్చిచేరినట్లయింది.

"వత్సా! ఈ రోజునుంచీ నీలో దొంగల్ని పనిగట్టే శక్తి ప్రవేశించింది. నీకు అవసరమైన వాళ్ళూ, అత్యంత ప్రమాదకరమూ అయిన వాళ్ళూ—దొంగలను నీవు వాసనతో పనిగట్టగలవు నీకీశక్తిని ప్రసాదించినందుకు ప్రతిఫలంగా నా గుడికి విపరీతమైన ప్రచారం చేయించి నా ఆదాయాన్ని పెంచాలి" అన్నమాటలతడి చెవిలో వినిపించాయి.

అది గోవిందరావు భ్రమకావచ్చు. మూఢవిశ్వాసం కావచ్చు. మర్నాడతడు మారువేషాల దొంగను సులభంగా గుర్తించి పట్టుకుని ప్రభుత్వంనుంచి పదివేల రూపాయల నగదు బహుమతిని పొందాడు. వ్యక్తిగతంగా యెందరో ప్రముఖులతడికి బహుమతులిచ్చారు.

గోవిందరావుకు త్రిమూర్తి దేవుడిమీద గురికుదిరింది. అప్పట్నించీ ఊళ్ళో వుంటే ప్రతిరోజూ దైవదర్శనానికి వెడుతున్నాడు. ఆ విధంగా పూజారి నరసింహమూర్తితో అతడికి కొంత పరిచయం కూడా పెరిగింది. పూజారి స్థితిగతులు తెలుసుకుని గోవిందరావు, "మీరు భయపడకండి. అబ్బాయికి బాగా చదువొస్తోంది. ఎంతవరకూ వస్తే అంతవరకూ చదివించండి. అమ్మాయికి పెళ్ళిసంబంధాలు చూడండి. మంచి సంబంధం రాగానే నాకు చెప్పండి.

అందరినీ దీవించే త్రిమూర్తి దేవుడికి పూజారి మీరు. అన్నింటికీ ఆ భగవంతుడే వున్నాడు" అని ధైర్యం కూడా చెప్పాడు.

గోవిందరావు ప్రయత్న లోపం లేకుండా త్రిమూర్తి దేవుడి గురించి పదిమందికీ ప్రచారం చేశాడు. ఆ ప్రచారానికి పెద్దగా ఫలితంలేదు. ఆలయానికి వచ్చే భక్తుల సంఖ్య పెరగనూ లేదు.

ఎటొచ్చీ గోవిందరావు కొత్తగా తనకబ్బిన శక్తి గురించి ఎవరికీ చెప్పలేదు. అది నేరస్థులకు తెలియడం వల్ల తనకే ప్రమాదం.

## 2

"రండి, రండి" అంటూ సాదరంగా ఆహ్వానించాడు నరసింహమూర్తి. అప్పుడాయన ఒంటరిగా వున్నాడు. గుడిలో వేరే భక్తులెవరూ లేరు.

"చాలా ఉత్సాహంగా కనబడుతున్నారు" అన్నాడు గోవిందరావు.

"అమ్మాయి పెళ్ళి కుదిరింది. చాలా మంచి సంబంధం!" అన్నాడు నరసింహమూర్తి ఉత్సాహంగా.

"చాలా మంచి వార్త చెప్పారు" అన్నాడు గోవిందరావు సంతోషంగా.

"అబ్బాయి ఆదర్శవాది. కట్నం తీసుకోడుట. పెళ్ళి ఆర్భాటంగా చేయడానికి వీల్లేదుట. ఈ గుడిలోనే దేవుడి ఎదుట దండలు మార్చుకుంటారుట. ఈ రోజుకు పదిరోజులుంది ముహూర్తం" అన్నాడు నరసింహమూర్తి.

"కళ్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదు" అన్నాడు గోవిందరావు.

"అంతా త్రిమూర్తి దేవుడి మహిమ. నేనూ మీలాగే ఆయన పాదాలంటుతూ సాష్టాంగపడ్డాను. అప్పుడు నా చెవిలో, 'త్వరలోనే నీ కూతురికి కోరుకున్నట్టూ సంబంధం వస్తుంది' అన్న మాటలు వినపడ్డాయి. అలాగే జరిగింది."

గోవిందరావాశ్చర్యంగా, "నిజంగానే ఈ దేవుడిలో అద్భుత మహిమలున్నాయి. అయితే వచ్చిన సంబంధమెలాంటిదో కాస్త విచారించారా?" అన్నాడు.

"విచారించడానికేముందండీ? సంబంధం తెలిసినదే! ఇంతకాలం మాకందుబాటులో లేదనుకున్నాం. కుర్రాడు మాకు దగ్గర బంధువుకూడా. అయితే వాళ్ళు బాగా కలిగినవాళ్ళు. కట్నమాశ ఉన్నవాళ్ళు. మాటవరసకో సారి సంబంధమడిగి ఊరుకున్నాం."

"ఊఁ" అన్నాడు గోవిందరావు కుతూహలంగా.

"రెండేళ్ళ క్రితం ఆ అబ్బాయి అన్నయ్యకు పెళ్ళయింది. వధువు తరఫువారు బాగా వున్నవాళ్ళు. మంచి కట్నమిచ్చారు. మేము సంబంధానికి వెళ్ళినప్పుడూ కట్నం గురించే చెప్పారు. అయితే ఇటీవల ఆ పిల్ల అంటే కోడలు పిల్ల అత్తమామలతో బాగా దెబ్బలాడింది. వాళ్ళకూ, ఆమెకూ పడలేదు. ఫలితంగా వేరు కాపురం. కొడుకు తనకు అత్తవారిచ్చిన కట్నంతో సహా తలిదండ్రుల్నించి తన వాటా రాబట్టుకుని వెళ్ళిపోయాడు. వారసత్వపుటాస్థి కావడంవల్ల కొడుకు వాటా యివ్వక తప్పలేదు తండ్రికి. ఇప్పుడు రెండో కొడుక్కీ ఉన్నింటి సంబంధం చేసుకోవాలంటే భయపడుతున్నాడాయన. అవిధంగా ఈ సంబంధం సాదాగా వచ్చింది."

"బాగుంది, చాలా బాగుంది. పెళ్ళి విషయంలో

సాయం కావాల్సొంటే ఒకమాట పడకుండా చెప్పండి. దేవుడి దయవల్ల నాకున్న బాధ్యతలూ తక్కువ. ఆదాయమూ ఎక్కువ" అన్నాడు గోవిందరావు.

"అంతమాట అన్నారు అదే చాలు. అమ్మాయి పెళ్ళి విషయంలో కాకపోయినా నాకు మీనుంచి సాయం కావాలి" అన్నాడు నరసింహమూర్తి.

"అడగండి" అన్నాడు గోవిందరావు అనుమానంగా.

"త్రిమూర్తి దేవుడికి ప్రచారం గురించి బాగా మనసుగా ఉంది. తన మహిమ గురించి బాగా ప్రచారం చేయమని ఆయన అన్నట్లు నాకు తోచింది."

"ఇలాంటిదే నాకూ జరిగింది" అన్నాడు గోవిందరావు.

"నేనీ ఆలయానికి పూజారిని కాబట్టి పొట్టకూటికోసం ప్రచారం చేస్తున్నానని అంతా అనుకుంటారు. మీరే ఈ ప్రచారానికి సహకరించాలి. పెద్ద పెద్ద వాళ్ళెందరినో మీరు కలుస్తూంటారు. అందరికీ ఈ దేవుడి గురించి చెప్పండి—" అన్నాడు నరసింహమూర్తి.

"దేవుడికి ప్రచారం గురించి ఇంత మనసేమిటో— విచిత్రంగా లేదూ?" అన్నాడు గోవిందరావు.

"నాకేమీ విచిత్రంగా లేదు. మహిమగల దేవుడి గురించి ప్రచారమైతే ప్రయోజనం దేవుడికి కాదు. భక్తులకే! భక్తులకు సాయపడడానికి భగవంతుడికెన్నో పద్ధతులుంటాయి. అందులో దర్శనానికి రప్పించుకోవడమొకటి! అందుకు మంచి ప్రచారం కావాలిగదా! ఎక్కువమంది భక్తులకు సాయపడాలనుకున్నప్పుడు భగవంతుడు ప్రచారాన్నాశ్రయిస్తాడు."

"తను సాయపడాలనుకున్న భక్తులను భగవంతుడు

తనకు తానే దగ్గరకు రప్పించుకోలేదా?"

"మిమ్మల్నాయన అలాగే రప్పించుకున్నాడు. మీనుంచి ప్రచారం కోరుకున్నాడు. మా తాతగారి విషయంలోనూ అంతే జరిగింది. ఇప్పుడాయన నానుంచీ ప్రచారం ఆశిస్తున్నాడు."

"నా ప్రయత్నం నేను చేస్తున్నాను. కానీ యెందు వల్లనో నావల్ల ఆట్టే ప్రయోజనం కనబడలేదు,"

పూజారి నిట్టూర్చాడు.

"స్వామి దర్శనం చేసుకుని వెడతాను. అవతల నాకింకా పనులున్నాయి" అన్నాడు గోవిందరావు.

ఇద్దరూ గర్భగుడిలోకి వెళ్ళారు.

గోవిందరావు త్రిమూర్తి దేవుడికి సాష్టాంగపడి యెందుకో ఉలికిపడి లేచాడు.

"ఏమయింది?" అన్నాడు పూజారి ఆశ్చర్యంగా.

"ఈ గర్భగుడిలో దొంగ ఉన్నాడు" అన్నాడు గోవిందరావు.

"ఎలా తెలుసు మీకు?"

"నాకు దొంగల వాసన తెలుస్తుంది."

"కానీ ఇక్కడ మీరు, నేను తప్ప ఇంకెవ్వరూ లేరు."

"అదే చిత్రంగా ఉంది నాకు...."

"చిత్రం కాదు, మీరు నన్నవమానిస్తున్నారు" అన్నాడు నరసింహమూర్తి.

"ఉన్నపళాన అవమానం గురించి మాట్లాడేవాళ్ళంటే నాకు చిరాకు. మన స్నేహం ఈనాటిదికాదు. అంత తొందరపడతారేం, అపార్థం చేసుకోవాలని!"

నరసింహమూర్తి మౌనం వహించాడు.

గోవిందరావు చటుక్కున విగ్రహం వెనక్కి వెళ్లాడు అక్కడ విగ్రహానికి కింద ఉన్న ఖాళీలో ముడుచుకుని కూర్చున్న ఓ మనిషినతడు చూసి చటుక్కున బయటకు లాగాడు.

ఆ వ్యక్తి పారిపోవాలని చూశాడు.

గోవిందరావుది ఉడుం పట్టు.

అతడు పెనుగులాడి ప్రయోజనంలేదని గ్రహించి కాళ్ళ బేరానికి వచ్చాడు.

గోవిందరావుది నేరస్థుల విషయంలో జాలిగుండె కాదు.

"మీరెంత అడిగితే అంతా యిచ్చుకుంటాను. నన్ను వదిలిపెట్టండి" అన్నాడతడు.

గోవిందరావు గత్యంతరం లేకపోతేతప్ప అవసరానికి అవినీతికి పాల్పడే పోలీసాఫీసరు కాదు.

అతడు తనకున్న కనెక్షన్సు చెప్పి బెదిరించాడు. గోవిందరావు కుటుంబాన్ని నేలమట్టం చేస్తానని హెచ్చరించాడు.

దేనికీ గోవిందరావు లొంగలేదు. పూజారి నడిగి తాళ్ళు తెప్పించి ఆ వ్యక్తిని బంధించాడు. తర్వాత నరసింహమూర్తిని విడిగా బయటకు తీసుకుని వెళ్ళాడు.

పూజారి కంగారుగా, "నాకేమీ తెలియదు" అన్నాడు.

"మీకు తెలియకుండా అతడు గర్భగుడిలోకెలా వచ్చాడు?"

"నిజంగా నాకు తెలియదు."

"నేను మిమ్మల్ని నమ్ముతున్నాను. కానీ మిమ్మల్ని ప్రశ్నలడగడం నా బాధ్యత. నేనడిగిన ప్రశ్నలకు

నిజాన్ని బదులివ్వడం మీకు క్షేమం."

"నేను మీకేకాదు ఎవరికైనా నిజమే చెబుతాను" అన్నాడు నరసింహామూర్తి గంభీరంగా.

"మీ అమ్మాయి పెళ్ళి కుదిరింది. వరుడు అనిపరుడు. పెళ్ళికి కట్నంలేదని మీరన్నారు. పెళ్ళికి కట్నం లేక పోవడానికీ గర్భగుడిలో నాకీ మనిషి దొరకడానికీ ఏ సంబంధమూ లేదంటారా?"

"అంతే!"

"ఈ మనిషినిక్కడ దాచడమే ఆ పెళ్ళికి కట్నమని నేనంటాను—"

"కాదు.... కాదు...."

"కట్నం మీరివ్వడంలేదు. ఈ మనిషి ప్రతిఫలంగా వియ్యాలవారికి డబ్బిస్తాడు. అవునా?"

"గోవిందరావుగారూ—మీరు మన స్నేహాన్ని విస్మరిస్తున్నారు."

"నరసింహామూర్తిగారూ—మన స్నేహాన్ని పురస్కరించుకొని నేనీ కేసు నుంచి తప్పుకుంటే మరో ఇన్‌స్పెక్టరైనా మిమ్మల్నడిగే ప్రశ్నలు మీకు వినిపిస్తున్నాను. కాసేపు మీరు మన స్నేహం గురించి మర్చిపోండి."

"నా బిడ్డలపై ఆన, ఆ త్రిమూర్తి దేవుడిపై ఆన. నిజం చెబుతున్నాను. ఆ మనిషిని నేనూ మీతోపాటే చూశాను."

"నమ్మడానికి కష్టం—"

"నేను నిజం చెబుతున్నాను...."

"ఏం చేయను? స్నేహం నమ్మమంటుంది? ఉద్యోగ ధర్మం అనుమానించమంటుంది. మీరు నన్ను ధర్మసంక

టంలో పడేశారు. మీరు కూడా వాళ్ళతోపాటు పోలీస్ స్టేషన్‌కు రావలసి వుంటుంది" అన్నాడు గోవిందరావు.

"మనం బయట కబుర్లు చెప్పుకుంటున్నప్పుడే మనిషి మనకు తెలియకుండా గర్భగుడిలోకి ప్రవేశించి వుంటాడు. నన్ను నమ్మండి."

"నమ్ముతాను. కానీ మీరు స్టేషనుకు రాకతప్పదు"

"ఇప్పుడు మీరు నన్ను దోషినిచేసి పోలీసుస్టేషనుకి నడిపిస్తే ఆ తర్వాత నేను నిర్దోషినని ఋజువైనా ప్రయోజనముండదు. నా కూతురు పెళ్ళి ఆగిపోతుంది" దీనంగా అన్నాడు నరసింహమూర్తి.

"సెంటిమెంట్లతో నన్ను కట్టేయాలనుకుంటున్నారా?"

"గోవిందరావుగారూ! మీకా మనిషి విషయంలో ఇంత పట్టుదలెందుకు? అసలతనెవరో కూడా మీరు కనుక్కోలేదు."

"అతనెవరో నాకు తెలుసు......" గంభీరంగా అన్నాడు గోవిందరావు.

"ఎవరు?"

"శివరాజు పేరు విన్నారా మీరు?"

నరసింహమూర్తి తల అడ్డంగా వూపాడు.

"నాలుగురోజుల క్రితం మనూళ్ళో ధర్మారావుగారు క్రూరంగా హత్య చేయబడ్డారు. తెలుసా మీకు?"

"పేపర్లో చూశాను."

"ధర్మారావుగారెందుకు హత్య చేయబడ్డారో తెలుసా మీకు?"

"ఊహుఁ."

"ఆయన ఒక నేరానికి ప్రత్యక్ష సాక్షి. నగరంలో

పెద్దమనిషిగా చెలామణీ అవుతున్న ఓ వ్యక్తి అసలు స్వరూపాన్నాయన చూశాడు. పోలీసులకు ఫోన్ చేసి విషయం చెప్పాడు. వివరాలకోసం పోలీసులాయనింటికి వెళ్ళేసరికాయన చచ్చిపడున్నాడు."

"దారుణం" అన్నాడు నరసింహమూర్తి అప్రయత్నంగా.

"పోలీసులకాయన చెప్పిన పేరు శివరాజుది. అందుకని పోలీసులు వెంటనే శివరాజింటికి వెళ్ళారు."

"శివరాజెవరు?"

"శివరాజ్ హోటల్ తెలియదా మీకు?"

"అరే—ఆ హోటలా? ఆ శివరాజా?" నరసింహమూర్తి ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"అవును, ఆ శివరాజే! అతడిమీద ఎన్నో ఆరోపణలున్నాయి. ఎన్నో వ్యవహారాల్లో అతడి చేయుందని అనుమానాలున్నాయి. కానీ ఏం లాభం? సాక్ష్యాలు, సాక్షులు దొరకడం దుర్లభం. ఇంతకాలానికి ధర్మారావా పని చేయబోగా మనిషే చచ్చాడు. అయితే ఆ హత్య శివరాజే చేశాడనడానికి తిరుగులేని ఆధారాలు కొన్ని లభించాయి. ఆ విషయమై అతణ్ణి ప్రశ్నించాలని వెళ్ళబోతే మనిషే మాయమయ్యాడు. ఇంట్లో అడిగితే ఏదో తెలియని జబ్బుతో బాధపడుతున్న కారణంగా నెల్లాళ్ళుగా ఊళ్ళోలేడని అబద్ధం చెప్పారు. అది అబద్ధమనడానికి చాలా ఆధారాలున్నాయి. పోలీసులు శివరాజు గురించి వెతుకుతున్నారు."

"ఇదంతా నాకు తెలియదు—"

"శివరాజు దగ్గర డబ్బుకు కొదవలేదు. అతణ్ని రక్షించగలిగినవాళ్ళు కూతుళ్ళ పెళ్ళికి కట్నాలివ్వక్క—

లేదు."

నరసింహమూర్తి చురుగ్గా గోవిందరావు కళ్ళల్లోకి చూసి, "మీరు నన్ననుమానిస్తున్నారు" అన్నాడు.

"గర్భగుడిలో మనం చూసింది శివరాజుని. అతణ్ణి నేను వెంటనే గుర్తుపట్టాను."

నరసింహమూర్తి మరోసారి ఆశ్చర్యంతో నోరు తెరిచి, "ఆ శివరాజిలా యిక్కడ...." అని ఆగి పోయాడు.

గోవిందరావతడివంకే తీక్షణంగా చూస్తున్నాడు.

"ఏమిటలా చూస్తున్నారు?" అన్నాడు నరసింహ మూర్తి.

"మీ ఆశ్చర్యంలో నటనలేదు."

నరసింహమూర్తి ముఖం చిన్నబోయింది—"అంటే ఇంకా మీరు నన్ననుమానిస్తున్నారా?"

"లేదనే అనుకోండి. అయినా మీరు నాతో స్టేషనుకు రాక తప్పదు" అన్నాడు గోవిందరావు.

"నేను తప్పుచేయలేదు కాబట్టి నాకు భయంలేదు. పోలీస్ స్టేషన్‌లో మీరు నన్ను తాత్కాలికంగా దోషిని చేసినా అది నా కూతురి భవిష్యత్తును నాశనంచేస్తుంది. ఏ తప్పూ చేయకపోయినా దానికి శిక్షపడుతుంది. నేరస్థుడి కూతురన్న కారణంగా వచ్చిన సంబంధం చెడి పోతుంది. ఆ తర్వాత నేను మిమ్మల్ని క్షమించినా, మిమ్మల్ని మీరు క్షమించుకోలేరు. ఆలోచించుకోండి" అన్నాడు నరసింహమూర్తి గంభీరంగా.

గోవిందరావు నవ్వి, "మీ అమ్మాయి పెళ్ళిబాధ్యత నాది. మీరు స్టేషనుకు దోషిగా కాదు, సాక్షిగా వస్తు న్నారు. సరేనా?" అన్నాడు.

నరసింహమూర్తి ముఖం వికసించింది, "నిజమైన స్నేహితులు మీరు" అన్నాడు సంతోషంగా.

"నేను మిమ్మల్ని దోషిని చేయకపోతే అందుకు కారణం మన స్నేహం కాదు, నా డ్యూటీ! రండి శివరాజుని చూద్దాం" అన్నాడు గోవిందరావు.

ఇద్దరూ గర్భగుడిలోకి వెళ్ళేసరికి అక్కడ శివరాజు త్రిమూర్తి దేవుడి విగ్రహానికి సాష్టాంగపడి కనిపించాడు.

## 3

శివరాజు ఉదంతం ప్రజల్లో గొప్ప సంచలనాన్ని కలిగించింది. శివరాజు వంటి పెద్దమనిషి నేరస్థుడు కావడమూ, తప్పించుకుని పారిపోవడమూ, పట్టుబడడమూ ప్రతిఒక్కరూ కథలుగా చెప్పుకోసాగారు.

ఇన్‌స్పెక్టర్ గోవిందరావుని యెందరో పత్రికా విలేఖరు లింటర్వ్యూ చేశారు.

సమయం వచ్చింది కదా అని గోవిందరావు త్రిమూర్తి దేవుడి ప్రసక్తి తెచ్చాడు. పూజారికీ, తనకూ కూడా ఆ దేవుడే సాయపడుతున్నాడని చెబుతూ, "ఈ కలియుగంలో దుర్మార్గులనణచాలంటే పోలీసు అధికారం, బలం చాలవు. దైవసహాయం కూడా వుండాలి. నేను నా సామర్థ్యంకంటే ఎక్కువగా త్రిమూర్తి దేవుడిని నమ్ముతాను" అన్నాడు.

శివరాజు వారంరోజులపాటు జైల్లో ఉన్నాడు. ఆ వారంరోజులూ అతడెవ్వరినీ కలుసుకోలేదు. ఏమీ మాట్లాడలేదు. పోలీసులు ప్రశ్నిస్తూంటే వెర్రిచూపులు చూసేవాడు.

ఊళ్ళోని పెద్దమనిషి కావడంవల్ల పోలీసులు కూడా అతడికి కొంత గడువునిచ్చారు. ఆరంభంలోనే అతణ్ని

హింసించడానికి పూనుకోలేదు.

వారంరోజుల తర్వాత శివరాజు లాయరు గోవింద రావుని కలుసుకున్నాడు. బెయిల్ మీద శివరాజుని విడి పించుకుని వెళ్ళాడు.

ఆ తర్వాత మరో వారంరోజులపాటు శివరాజు మౌనంగా ఉన్నాడు. అతణ్నుంచి యేవిధమైన రెస్పాన్సూ లేదు.

ధర్మారావు హత్య కేసును ఇన్‌స్పెక్టర్ రమణ చూస్తున్నాడు. గోవిందరావు, రమణకలిసి శివరాజుకు వ్యతిరేకంగా కేసును తయారుచేస్తున్నారు. కేసు పటిష్టంగా ఉన్నట్లే లెక్క!

రమణకూడా, గోవిందరావులాగే నీతి, నిజాయితీలను నమ్ముకున్నాడు. ఇద్దరికీ కూడా చాలా ఉత్సాహంగా ఉంది—శివరాజులాంటి నరరూప రాక్షసుణ్ని అంతం చేయబోతున్నందుకు.

ఆ సమయంలో ఇద్దరికీ ఒక్కసారే శివరాజునుంచి పిలుపు వచ్చింది.

## 4

చిన్న గది!

గదిగోడలకు ఖరీదైన పెయింటింగ్సున్నాయి. గది నేలపై ఖరీదైన తివాచీ పరచబడింది. ఆ తివాచీపై ఆరు ఖరీదైన కుర్చీలున్నాయి. అందులో మూడు కుర్చీలు ఖాళీగా ఉన్నాయి. నిండుగా ఉన్న కుర్చీల్లో ఒక్కడు మాత్రమే ఖరీదైన మనిషి.

అతడు శివరాజు, వాళ్ళిద్దరూ ఇన్‌స్పెక్టర్లు!

“మనిషి ఎంత ప్రయత్నించినా తనకుతానై గాల్లోకి ఎగరలేడు. అందుకే విమానాన్ని కనిపెట్టాడు” అన్నాడు

శివరాజా.

"అయితే?" అన్నాడు రమణ.

"మీరు నేను విమానాన్ని" అన్నాడు శివరాజా.

"అంటే?" అనాలనుకున్నాడు గోవిందరావు. అనే లోగానే శివరాజా భాష మరీ దుష్కరమయింది.

"గాల్లో ఎగరాలన్న కోరిక లేదు మాకు. నేలమీదే నడుస్తాం" అన్నాడు రమణ.

"కొందరికి ఛాయిస్ ఉండదు" అన్నాడు శివరాజా.

"మాకుంది" అన్నాడు గోవిందరావు.

శివరాజా వ్యంగ్యంగా నవ్వి, "కొందరు ఛాయిస్ ఉందనుకుని భ్రమపడతారు. అలాంటివాళ్ళే మీరు...." అన్నాడు.

"చెప్పదల్చుకున్నది సూటిగా చెప్పండి" అన్నాడు గోవిందరావు.

"సూర్యకిరణాలు సూటిగా దాకితే అల్ట్రావయొలెట్ రేస్ బాధిస్తాయని దేవుడు భూమికి కాస్తైనా వాతావరణపు పొర పెట్టాడు. నేను చండ ప్రచండ సూర్యుణ్ణి. నావంక మీరు తేరిపార చూడలేరు" అన్నాడు శివరాజా.

"ఫరవాలేదు, చెప్పండి."

"మీకు భూమ్మీద ఉండే ఛాయిస్ లేదు. ఆకాశం, లేదా పాతాళం!" అదోలా నవ్వాడు శివరాజా.

"పాతాళమా, అదెక్కడుంది?" అన్నాడు గోవిందరావు.

"నేను తలచుకుంటే మీకది చూపించగలను___"

"చూపించండి! స్వయం శక్తితో భూమ్మీంచి ఆకా

కానికెగరడంకంటె, పాతాళంనుంచి ఆకాశానికెగరడం నాకిష్టం."

"మీ యిష్టప్రకారం మీరేమీ చేయలేరు—"

"ఎందుకని?"

"ఇష్టంప్రకారం చేయగల అవకాశం నావంటివారికే గానీ మీబోంట్లకు లేదు."

"ఎలా?"

"నేను తల్చుకుంటే నడిరోడ్డుమీద మిమ్మల్ని కాల్చి చంపగలను. మీరలా చేయలేరు. ఎందుకంటే మీరు బాధ్యతకు కట్టుబడ్డ ఉద్యోగులు."

"మీవంటి వాళ్ళను చీల్చిచెండాడడం కూడా మా బాధ్యత."

"మీది ధర్మయుద్ధం. నా శత్రువును నాశనం చేయ డానికి నాకేలాంటి నియమాలూ అడ్డురావు. ధర్మమే జయిస్తుందనుకుంటే అది కలియుగంకాదు. ఆలోచించు కోండి. ఆవేశం మానుకోండి. వివేకాన్ని పెంపొందించు కోండి" తమాషాగా నవ్వుతూ అన్నాడు శివరాజు.

"మేమేం చేయాలి?"

"కొందరికి ఛాయిస్ ఉండదు. మీకుంది. ఆకాశమా, పాతాళమా అన్నది తేల్చుకుని నాకు చెప్పండి."

"ఇందాకనే మాకు ఛాయిస్ లేదన్నారు. మర్చి పోయారా?

శివరాజు నవ్వి "ఇప్పుడైనా నేనివ్వడంవల్లనే మీకు ఛాయిస్ వచ్చింది. మీకు అర్థంకావాలంటే జైన మత స్థుల గురించి చెప్పాలి" అన్నాడు.

"ఎందుకు?"

"వాళ్ళు జీవహింస భరించలేరు. సూక్ష్మజీవులు

నోట్లోకి ప్రవేశించి పంటికింద నలిగిపోకుండా, వాళ్ళ మూతికి గుడ్డ కట్టుకుంటారు. దీపం పురుగులపై జాలితో దీపం వెలిగించడానికి ముందే భోంచేస్తారు. అంత మాత్రాన వారివల్ల జీవహింస జరుగదా? వారికి తెలియకుండా కాలికింద యేదో సూక్ష్మజీవి మరణించవచ్చు. అంటే అర్థమేమిటి? తెలిసి వారు జీవహింస చేయరు. అలాగే నేనూను. నా కార్య కలాపాల్లో విజయం సాధించడానికి ఎందరో సామాన్యులు బలైపోతూంటారు. అది ఆపడం నా చేతుల్లో లేనిపని! అంటే ఆ సామాన్యులకు నేను కూడా ఛాయిస్ ఇవ్వలేను. కానీ మీవంటి కొందరికి ఛాయిస్ ఇవ్వగలను. అది మీ అదృష్టం. అర్థమయిందా?"

"ఇప్పుడు మేమేం చేయాలి?" అన్నాడు రమణ.

"ఈ ప్రశ్నకు జవాబు మీకు తెలుసు."

"మీరు కోరిన ప్రకారం మేము చేయకపోతే?"

"ఇంటికి వెళ్ళండి. ప్రశ్నకు జవాబు తెలుస్తుంది."

రమణ, గోవిందరావు ముఖముఖాలు చూసుకున్నారు.

"తెలియకపోతే?" అన్నాడు గోవిందరావు.

"మీకా సందేహం అవసరంలేదు."

"అన్నీ మీరనుకున్నట్లు జరక్కపోతే?"

అప్పుడు శివరాజా రెండునిముషాలుపాటు ఆగకుండా సినిమాలో విలన్‌లా నవ్వాడు. నవ్వాపుకున్నాక, "నేను మిమ్మల్నింటికి పంపుతున్నదే మీ సందేహానికి సమాధానం తెలుసుకుంటారని! ఒక్క విషయం గుర్తుంచుకోండి. నేనిప్పుడు వెళ్ళనిస్తున్నాను కాబట్టే మీరింటికి వెళ్ళగల్గుతున్నారు" అన్నాడతడు.

# 5

గోవిందరావు ఇంటికి వెళ్ళేసరికి అతడి భార్య కంగారుగా, "అబ్బాయింకా స్కూల్నుంచింటికి రాలేదండీ" అంది.

గోవిందరావు తడబడ్డాడు.

"అప్పుడు సమయం రాత్రి ఏడు. స్కూలు నాలుగింటికి వదిలితే కొడుకింటికి రావడానికి నాలుగున్నర దాటుతుంది.

ఇద్దరాడపిల్లల తర్వాత అయిదేళ్ళ గ్యాపుతో లేక లేక పుట్టిన కొడుకు గోవిందరావుకి. వాడి పేరు భాస్కర్. ఆ యింటికి వెలుగునిచ్చే భాస్కరుడు వాడు. వాడి వయసు ఏడేళ్ళు మాత్రం.

"ఇంటికి వెళ్ళండి. ప్రశ్నకు జవాబు తెలుస్తుంది" అన్న శివరాజు మాటలు గోవిందరావు చెవుల్లో గింగురుమంటున్నాయి.

"వాడి క్లాసుమేటుని వాకబు చేయలేదా?" అన్నాడతడు భయం, ఆత్రుత మేళవించిన కంఠస్వరంతో.

గోవిందరావు భార్య వాకబు చేసింది. స్కూలు వదిలే ముందు క్లాసుకో యువకుడు వచ్చేట్ట. అతడు చాలా ఆధునికంగానూ, అందంగానూ ఉన్నాట్ట. తనను డియస్పీ పంపినట్లు చెప్పేట్ట అతడు. అక్కడేదో పార్టీ ఉందనీ భాస్కర్ని సరాసరి అక్కడకు తీసుకురమ్మనమనీ గోవిందరావు చెప్పినట్లు అన్నాట్ట.

భాస్కర్ ఆ యువకుడితో వెళ్ళాట్ట.

అరగంట క్రితమే ఈ విషయం తెలుసుకుంది గోవిందరావు భార్య.

"ఇంతవరకూ ఏం చేస్తున్నావ్?" విసుగ్గా అన్నాడు

గోవిందరావు.

"ఓ గంటసేపు బెంగతో గడిచిపోయింది. తర్వాత నాలుగిళ్ళూ తిరగడం మొదలెట్టాను. మన వీధిలో సునీల్ ఒక్కడే కదా వాడి స్కూల్లో చదువుతున్నది. వాళ్ళింటికి వెళితే వాడెప్పుడో వచ్చాడనీ వస్తూనే నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని ఆటలకని పరుగెత్తుకు పోయాడనీ తెలిసింది. వాడొచ్చాక ఈ విషయం తెలిసింది."

"కబురు వాడు వెంటనే చెప్పొద్దూ—అంతసేపేం చేస్తున్నాడు?"

"వాడికేం తెలుసు? మనమంతా డీయస్పీగారింట్లో పార్టీకి వెళ్ళామనీ, ఇంట్లో ఎవరూ ఉండరనీ అనుకున్నాట్ట...."

"డీయస్పీగారికి ఫోన్ చేయలేదా?"

"చేశాను. వాళ్ళూళ్ళో లేరు."

"డీయస్పీగారూళ్ళోనే వున్నారు...." అన్నాడు గోవిందరావు.

"ఏమో మరి—ఫోన్ చేస్తే అలా చెప్పారు."

గోవిందరావు కంగారుగా, "ఉండు, నేను స్వయంగా ఆయన్ను కలుసుకుని వస్తాను" అన్నాడు.

"మన భాస్కర్ కేమయిందండీ!" అంది గోవిందరావు భార్య కంగారుగా.

"భయపడకు. ఏం జరిగిందో నాకు తెలుసు. బాబు క్షేమంగానే వున్నాడు. వాణ్ణి నేను తీసుకుని వస్తాను".

"నిజంగానా?"

"ఊఁ" అంటూ వీధిలోకి నడిచాడతడు తర్వాత....

గోవిందరావు మోటార్ సైకిలు స్టార్టుచేశాడు.

# 6

గోవిందరావు డీయస్పీ ఇంటికి వెళ్ళేసరికి అక్కడ ఇన్‌స్పెక్టర్ రమణ వున్నాడు.

గోవిందరావు కొడుకు భాస్కర్ ఎలా మాయమయ్యాడో అదేవిధంగా రమణ ఆరేళ్ళ కూతురు దీప కూడా మాయమయింది.

డీయస్పీ యిద్దరి కథా విని, "ఈ వ్యవహారంలో నా పేరు రావడం బాధగా వుంది" అన్నాడు.

"శివరాజుని మళ్ళీ అరెస్టు చేస్తాం" అన్నాడు రమణ.

"మీ యిష్టం. కేసు నెలా సాల్వ్ చేస్తారో చేయండి. కానీ నా పేరు నిందులో రానివ్వకండి. ఇది నాకు అవమానం" అన్నాడు డీయస్పీ.

గోవిందరావు చిన్నబుచ్చుకుని, "సర్, మా పిల్లల ప్రాణాలు ప్రమాదంలో వున్నాయి. నేరస్థుడు చాలా తెలివిగా వ్యవహరించాడు. మీరు మీ పేరు ఇరికించింది చేమన్నట్లు మాట్లాడుతున్నారు...." అన్నాడు.

డీయస్పీ అతిడివంక అదోలా చూసి, "పోలీసు డిపార్టుమెంట్లో మన భార్యాబిడ్డలకే కాదు, మనవి కూడా ప్రాణాలు ప్రమాదంలోనే ఉంటాయి. అదో పెద్ద విశేషం కాదు. యుద్ధంలో సిపాయిలకులా, నేరస్థుల ముందు మనం నిలబడతాం. ఎంతో అనుభవంతో, ఎన్నో ప్రమాదాలు గడిచి గట్టెక్కాకనే నేను డీయస్పీ నయ్యాను. అందువల్ల ప్రమాదాలకు నేను చలించను. అయితే ఉన్నతాధికారిని కాబట్టి అందరికళ్లూ నామీదనే ఉంటాయి. నా ప్రతిష్ఠతో మన డిపార్టుమెంటు ప్రతిష్ఠ ముడిపడి ఉంది. ఇదిగో పులి అంటే అదిగో తోక అనే వాళ్ళెందరో వుంటారు. మీరిప్పుడు నా పేరు బయటకు

తె స్తే డీయస్పీ, శివరాజు చేతులు కలిపారని పత్రికల వాళ్ళంటారు. అప్పుడు మన మొహ్వరం తలెత్తుకోలేం. నా పాయింటర్థమయిందా?" అన్నాడు.

ఇన్ స్పెక్టర్లిద్దరూ బుద్ధిగా తలాడించి డీయస్పీ యింట్లోంచి బైటకు వచ్చారు.

ఇద్దరి మోటారు సైకిల్సూ అక్కడ పార్కు చేసి ఉన్నాయి.

వాటిలో ఒకదానిమీద కూర్చుని రెండోదానిమీద కాలు పెట్టుకుని చిద్విలాసంగా సిగరెట్ కాలుస్తూ కని పించాడో యువకుడు.

"ఎవరున్నువ్వు?" అన్నాడు రమణ సాధికారంగా.

యువకుడి పోజులో మార్పులేదు. అతడొకసారి సిగరెట్ నోట్లోంచీ బైటకుతీసి నుసి విదిలించి, "మీ ఇద్దరికీ శ్రేయోభిలాషిని" అన్నాడు.

ఇన్ స్పెక్టర్లిద్దరూ తెల్లబోయారు.

"డీయస్పీ యింటి యెదుట, ఇన్ స్పెక్టర్లతో ఎంత నిర్లక్ష్యంగా మాట్లాడుతున్నావు?" అన్నాడు గోవింద రావు కోపంగా.

"అయితే వెళ్ళి డీయస్పీకి నామీద ఫిర్యాదు చేయండి. ఆయన మీకు డిపార్టుమెంటు ప్రతిష్ఠ ఎలా కాపాడాలో చెప్పిపంపించేస్తాడు!" అన్నాడా యువకుడు వ్యంగ్యంగా నవ్వుతూ.

"ఎవరున్నువ్వు?"

"ఒక పాప, ఒక బాబు నా దగ్గర క్షేమంగా వున్నారు. వాళ్ళ క్షేమం ఇప్పుడిక మీ చేతుల్లో ఉంటుంది."

ఇన్ స్పెక్టర్లిద్దరూ అతణ్ని మోటార్ సైకిల్సుమీంచి

దింపి విసురుగా జీపులో తోశారు.

"నా క్షేమమే మీ పిల్లల క్షేమం. ఇక్కడ జరిగే దంతా వెయ్యికళ్ళతో కనిపెడుతున్న వాడొకడున్నాడు. వాడు మీరు నన్నేంచేస్తే మీ పిల్లల్నదే చేస్తాడు" అన్నాడా యువకుడు.

"ఎవరున్నావ్?" అన్నారిన స్పెక్టరిద్దరూ.

"ఎదురుగా డీయస్పీగారిల్లు. మనమిక్కడ మాట్లాడు కోవడం బాగుండదు. మనం సంగీతా పార్కుకి వెళ్ళి అక్కడ మాట్లాడుకుందాం" అన్నాడా యువకుడు.

ఇన్ స్పెక్టరిద్దరూ అతడితో అట్టే వాదించకుండా వెంటనే మోటార్ సైకిల్సు స్టార్టు చేశారు.

ఆ యువకుడిన స్పెక్టర్ రమణ వెనుక కూర్చున్నాడు.

అయిదు నిముషాల్లో అంతా పార్కు చేరుకున్నారు. లోపల వెళ్ళి ఓచోట కూర్చున్నాక, "మీరేం చేయాలో మీకు తెలుసు. అందుకని ఆ విషయం నేను వివరించను. మీకు నేనో ఫోన్ నంబరిస్తాను. మీరు చేయవలసింది చేయగానే ఆ నంబరుకు చెప్పండి. ఆ తర్వాత పది నిము షాల్లో మీ పిల్లలు మీ యిళ్ళకు తిరిగొస్తారు" అన్నాడా యువకుడు.

రమణ, గోవిందరావు ముఖముఖాలు చూసుకున్నారు.

ఇద్దరికీ ఉక్రోషంగా ఉంది.

ఇద్దరికీ రక్తం మరుగుతోంది.

ఆ యువకుణ్ని చూస్తూంటే చంపేయాలన్నంత కసి. కానీ ఏమీ చేయలేని అసహాయత!

"త్వరగా మీ నిర్ణయం చెబితే ఫోన్ నంబరు చెలు తాను...." అంటూ హెచ్చరించాడా యువకుడు.

"ఫోన్ నంబరు....ఆదే ఒక పెద్ద ట్రా...." అను

ఉన్నారిద్దరూ.

"సరే — ఫోన్ నంబరు చెప్పు...." అన్నాడు గోవిందరావు.

అతడు చెప్పాడు.

అది వింటూనే ఇన్స్పెక్టర్లిద్దరూ ఉలిక్కిపడ్డారు. వారిద్దరికీ కూడా ఎంతో పరిచితమైన డీయస్పీ ఇంటి నంబరది!

"నువ్వు శృతిమించి రాగాన పడుతున్నావు...." అన్నాడు రమణ.

"నేనీ ఫోన్ నంబరివ్వడానికి కారణమేమిటో తెలుసా? మీరేం చేయాలో మీకు బాగా తెలుసుందని!"

"అంత సులభంగా నీ మాటలు నమ్మను. నీవంటి వాళ్ళను నా అనుభవంలో చాలామందిని చూశాను. రిస్కు తీసుకని నిన్ను స్టేషనుకు నడిపిస్తాను. అక్కడ అవసరమైతే నీ ప్రాణాలు తీస్తాను" అన్నాడు గోవింద రావేశంగా.

"నా ప్రాణాలు నాకు విలువైనవి కాదు. దేశానికీ విలువైనవికావు. నేను పోతే సంతోషించేవారే తప్ప యేడ్చేవారు లేరు. అందుకని నన్నేదో చేయాలనుకుని మీరు సాధించేదేమీలేదు. మీరు మీ బిడ్డల ప్రాణాల గురించి ఆలోచించుకోండి" అన్నాడాయువకుడు నిర్లక్ష్యంగా.

"నీ ప్రాణాలు పోతే సంతోషించేవారెవరు?" అన్నాడు రమణ.

"నా కుటుంబం. అంటే తల్లి, తండ్రి, తాత, బామ్మ ముగ్గురు తమ్ముళ్ళు, ఇద్దరు చెల్లెళ్ళు. నేను బియ్యే ప్యాసై ఉద్యోగంలేక అలమటిస్తున్నాను. మా నాన్న అనా

రోగ్యం కారణంగా ఉద్యోగంలోంచి తొలగించబడ్డాడు. అంతా నేనేదో చేస్తానని ఆశిస్తున్న సమయంలో నేనేమీ చేయలేకపోతున్నాను. అప్పుడు నన్నో పెద్ద మనిషి చేరదీసి నెలకు మూడువేల రూపాయల జీత మిస్తానన్నాడు. అప్పట్నుంచీ ఆయన చెప్పిన పనల్లా చేస్తున్నాను. నేను చేపట్టినవన్నీ ప్రమాదకరమైన పనులే! పని సాఫీగా అయిపోతే నా జీతం నెలకు మూడువేలు. కానీ నేను నా శత్రువులకు దొరికిపోయి హింసలకు గురైతే నాకు అదనంగా జీతం వస్తుంది. అది నా అసలు జీతంకంటె ఎక్కువ, అందుకే నేనుత్సాహంగా ప్రమాదాల్లో ప్రవేశిస్తాను. శత్రువులు నన్ను హింసించాలని యెదురుచూస్తాను. గత రెండు సంవత్సరాల్లో ఒక్కసారి మాత్రం శత్రువులు నన్ను పట్టుకుని రోజంతా హింసించారు. ఈలోగా నా యజమాని నన్ను విడిపించుకున్నాడు. ఆ ఒక్కరోజుకీ నాకు పదివేల రూపాయల ప్రతిఫలం వచ్చింది. మళ్ళీ అలాంటి అవకాశం వస్తే నాకు చాలా సంతోషం. నా ప్రాణం కనుకపోతే, నా ఇంటికి అయిదు లక్షలు చేరుకుంటాయి. 'నేను నమ్మకద్రోహం చేస్తే మాత్రం—నా ఉద్యోగం పోతుంది, 'నేను పడ్డహింసకు ప్రతిఫలముండదు, పైగా నా ప్రాణాలు పోతాయి. ఇదీ నా ప్రాణం కథ."

గోవిందరావు, రమణ తెల్లబోయారు.

ఆ యువకుడు నిశ్చల గంభీరంగా ఉన్నాడు.

అతణ్ని చూడగానే అర్థమవుతుంది—ఈ దేశంలో సంఘవిద్రోహులు, దుర్మార్గులు యెవరినాధారంగా చేసుకుని మనగల్గుతున్నారో!

"మీరింకా ఆలోచిస్తూనే ఉన్నారు. బహుశా

నన్నింకా మీరు నమ్మినట్లులేదు. తిరుగులేని మరో ఋజా వును మీముందు ప్రదర్శిస్తాను" అంటూ ఆ యువకుడు తన జేబులోంచి ఒక ఫోటో తీశాడు.

ఇద్దరూ ఆ ఫోటోని చూసి గుర్తుపట్టారు.

అందులో ఓ యువకుడున్నాడు. అతడి పేరు విజయ్ అనీ, అతడు డీయస్పీ కొడుకనీ వారికి తెలుసు.

అంటే శివరాజు విజయ్‌ని బందీ చేశాడా? డీయస్పీని బెదిరిస్తున్నాడా?

"మీరీఫోటోని తీసుకువెళ్ళి మీ వీధిలో మీ పిల్లల క్లాసుమేట్సుకి చూపించండి. వాళ్ళతణ్ని గుర్తుపడతారు" అన్నాడా యువకుడు.

మళ్ళీ ఇన్‌స్పెక్టరిద్దరూ ఉలిక్కిపడ్డారు.

అంటే?

తమ పిల్లల్ని తీసుకువెళ్ళింది డీయస్పీ కొడుకు విజయ్ అన్నమాట—అదెలా సాధ్యం?

అప్రయత్నంగా అన్నాడు గోవిందరావు, "ఇంతకీ యిప్పుడు మేమేం చేయాలి?"

"ఇంకా అర్థంకాలేదా?"

"నాకర్థమయింది" అన్నాడు రమణ, "ధర్మారావు హత్య కేసు ఫైల్సు పరిశీలనకై డీయస్పీగారికివ్వాలి. అవునా?"

యువకుడు నవ్వి, "అర్థమైతే చాలదు. అర్థమైనట్లుగా ప్రవర్తించాలి" అన్నాడు.

## 7

ఆ యువకుడు చెప్పింది అక్షరాల నిజం.

భాస్కర్, దీపల క్లాస్‌మేట్సు ఆ ఫోటోని గుర్తు పట్టారు.

ఇన్‌స్పెక్టర్లిద్దరూ కలిసి వెళ్ళి ధర్మారావు హత్య కేసు ఫైల్ని డీయస్పీ యింట్లో ఇచ్చి, తర్వాత డియస్పీ యింటి నంబరుకే ఆ విషయం ఫోన్ చేసి చెప్పారు.

అంటే డీయస్పీ హస్తం శివరాజు వ్యవహారంలో ఉన్నదని వారిద్దరికీ తిరుగులేని ఋజువయింది.

గోవిందరావు ఆలోచనలో పడ్డాడు.

రమణ ఆలోచించడం మానేశాడు.

పిల్లలు తిరిగిరావడమే ఒక విశేషంగా భావిస్తున్నాడతడు.

పిల్లలు చెప్పిన ప్రకారం వాళ్ళను తీసుకువెళ్ళింది డీయస్పీ కొడుకు విజయ్. పిల్లలు వాళ్ళింట్లోనే వున్నారు. చక్కగా, క్షేమంగా వున్నారు. రకరకాల ఆటలాడుకున్నారు. అసలు వాళ్ళకిల్లు సంగతే గుర్తులేదు.

కార్టూన్ సినిమాలు, ఐస్‌క్రీంలు, ఆటలు....

గోవిందరావుకి చాలా ఉక్రోషంగా వుంది.

త్రిమూర్తి దేవుడి సమక్షంలో తను పట్టుకున్నాడు శివరాజుని. ఆ కారణంగా తనకు డిపార్టుమెంటులో, ప్రజల్లో పేరుప్రతిష్ఠలు పెరుగుతాయనీ, నేరస్థులకు తనంటే సింహస్వప్నంగా ఉంటుందనీ ఆశించాడు.

జరిగిందానికతడికి చాలా బాధగా ఉంది.

ఏదో చేయాలి....ఏదో చేయాలి....

ఏం చేయాలన్నా డీయస్పీ ఫోన్ నంబరు, ఆయన కొడుకు విజయ్ గుర్తుకు వస్తున్నారు. దాంతో ఏం చేయాలో తెలియడంలేదు.

ఇక ఆగలేక ఒకరోజున డీయస్పీ యింటికెళ్ళాడు గోవిందరావు.

అప్పటికి కొడుకు తప్పిపోయి దొరికి నాలుగురోజు

అయింది.

"సార్ — ఫైలు చూశారా?" అనడిగాడతడు.

"ఏ ఫైలు?" అన్నాడు డీయస్పీ.

"ధర్మారావు హత్యకేసు ఫైలు!"

"అదా — దానిమీద నీకాసక్తి ఎందుకు? ఇన్‌స్పెక్టర్ రమణకు సంబంధించినదది!"

"సర్ — ఆ హత్య కేసులో అనుమానితుడు శివరాజు. అతణ్ణి నేనే పట్టుకున్నాను."

"నువ్వు బోడితలకూ, మోకాలికీ ముడివేస్తున్నావు. కోడిగుడ్డుకీకలు పీకుతున్నావు.... ఈ కేసులో శివరాజు ప్రసక్తి యెందుకొచ్చింది?" అన్నాడు డీయస్పీ చెప్పలేనంత చిరాకును ప్రదర్శిస్తూ.

"అన్నీ ఆ ఫైల్లోనే ఉన్నాయి సార్,"

"అంతా మన చేతుల్లోనే ఉన్నప్పుడు ఎందుకుండవు? తల్చుకుంటే ప్రధాన మంత్రికికూడా వ్యతిరేకంగా ఫైలు తయారుచేయొచ్చు. మనమిక్కడున్నది పాత పగలు చల్లార్చుకుందుక్కాదు. ప్రతీకారాలు తీర్చుకుందుక్కాదు. అమాయకులను రక్షించడానికి! దుర్మార్గుల్ని శిక్షించడం కంటే అమాయకుల్ని రక్షించడమే మనకు ముఖ్యం! పదిమంది దుర్మార్గులు శిక్ష తప్పించుకున్నా ఒక్క అమాయకుడికి శిక్షపడకూడదన్న సిద్ధాంతం నువ్వు విస్మరించావా!" అన్నాడు డీయస్పీ.

"లేదుసర్! అమాయకుల్ని రక్షించడంకోసమే శివరాజు వంటి వాళ్ళను జైల్లో పెట్టాలనుకుంటున్నాను."

"పాపం — ఆ అమాయకుడు నిన్నేం చేశాడు!"

"శివరాజు అమాయకుడా?" అన్నాడు గోవిందరావు.

"పాపం — అతడి కథ నీకు తెలియదా?"

"నాకు తెలిసిన కథ బుజావులు, సాక్ష్యాలతో సహా ఫైల్లో వుంది, సార్!" అన్నాడు గోవిందరావు వినయంగా.

"ఏ కేసునైనా తున్నాంగా పరిశీలించాలి. పరిశోధించాలి. సగం సగం పరిశోధించి నిర్ణయాలకు రాకూడదు. నీకు శివరాజు కథ పూర్తిగా తెలియదు. అతడి గురించి నేను చెబుతాను విను" అన్నాడు డీయస్పీ.

వినడం గోవిందరావుకు తప్పనిసరయింది.

శివరాజు సమర్థుడు. అందువల్ల ఎంతో డబ్బు సంపాదించాడు.

శివరాజు మంచివాడు. అందువల్ల యెన్నో మంచి కార్యాలు చేశాడు.

శివరాజు దయామయుడు. అందువల్ల యెందరికో సాయపడ్డాడు.

శివరాజు అమాయకుడు. అందువల్ల ఎందరినో గుడ్డిగా నమ్మాడు.

డీయస్పీ ప్రస్తుతం ఇల్లు కట్టుకుంటున్నాడు. ఆఫీసు నుంచి వచ్చిన లోన్ చాలకపోతే అవసరమైన డబ్బు సర్ది సాయపడ్డాడు శివరాజు. అతడికి డీయస్పీతో పనేమిటి? కేవలం దయాగుణంతో అతడాయనకు సాయపడ్డాడు.

శివరాజు గుడ్డిగా నమ్మిన వాళ్ళలో ధర్మారావున్నాడు.

ధర్మారావుకింతా అంతా అనకుండా సాయం చేశాడు శివరాజు. అందుకా్కరణమొక్కటే! ఇద్దరూ చిన్ననాటి స్నేహితులు.

ధర్మారావుకి శివరాజంటే అసూయ. అందుకా్

రణం ఒక్కటే! శివరాజుకిలా ఆయన పైకి రాలేకపోతున్నాడు.

శివరాజు తన్ను గుడ్డిగా నమ్ముతున్నాడని గ్రహించి ధర్మారావా నమ్మకాన్ని ప్రయోగించుకుని శివరాజు పేరు మీద కొన్ని ఘోరాలు చేశాడు. అవి శివరాజే చేశాడనడానికి ఋజువులు, సాక్ష్యాలు సంపాదించాడు. శివరాజు శత్రువులతో స్నేహం కలిపాడు. ఒకరోజున పోలీసులకు విషయం చెప్పాడు.

శివరాజు శత్రువులు ధర్మారావును పరిమార్చారు. నేరం శివరాజుమీదకు పోయింది.

ఇది వినగానే శివరాజు షాక్ తిన్నాడు.

తనమీద నేరం మోపబడిందనికాదు, తను నమ్మిన ప్రాణస్నేహితుడలా చేసి ప్రాణాలు పోగొట్టుకున్నాడని! ఆ షాక్ యెంత గట్టిదంటే తాత్కాలికంగా అతడికి మతి చలించింది.

శివరాజు ఇంట్లో వెర్రిచేష్టలు ప్రారంభించేసరికి అంతా కంగారుపడ్డారు. పర్సనల్ డాక్టర్ని పిలిస్తే ఆయన చూసి, "ఇది తాత్కాలికమైన షాక్! నరాలనదుపుచేయడానికి నేను మందులిస్తాను. కొద్దిరోజుల్లో మనిషి మామూలుగా అయిపోతాడు. అంతవరకూ ఆయన్ను జాగ్రత్తగా చూసుకోండి. విషయం రహస్యంగా వుంచండి" అన్నాడు.

వాళ్ళా ప్రకారమే చేయాలనుకున్నారు. అందుకే పోలీసులకు తోచిన అబద్ధాలు కూడా చెప్పారు. కానీ.... శివరాజు ఇంట్లోంచి పారిపోయాడు. ఆ స్థితిలో అతడిని గోవిందరావు పట్టుకున్నాడు. శివరాజేమేమో వాగివుండవచ్చునప్పుడు. అదంతా మతిభ్రమించిన కారణంగా

జరిగింది!

పట్టుబడ్డాక కూడా శివరాజు పరిస్థితి బాగోలేదు. అతడి ఆరోగ్యం మామూలు స్థాయికి చేరుకుందని తెలియగానే లాయరతణ్ని బెయిలుమీద విడిపించుకుని వెళ్లాడు.

"ఇదీ అసలు కథ!" అన్నాడు డీయస్పీ.

"ఆ తర్వాత జరిగిన కథ కూడా మీకు తెలుసుగా! దానికేమంటారు?" అన్నాడు గోవిందరావు.

"అనడానికేముంది? సమాజంలో పరువు ప్రతిష్ఠలున్న వాళ్ళు వాటిని కాపాడుకునేందుకు కాస్త కఠినంగా ప్రవర్తిస్తారు. వారి మనస్తత్వాన్నీ, ఇబ్బందుల్నీ అర్థం చేసుకోవాలి తప్ప మనం దేనికీ వాళ్ళను తప్పుపట్ట కూడదు" అన్నాడు డీయస్పీ.

గోవిందరావప్పుడింకేదో అనబోయి ఆగిపోయాడు. ఏదో వాసన అతడి ముక్కుపుటాలను సోకింది.

అదే వాసన!

ఆ వాసన సాయంతోనే తను గతంలో ఓ నేరస్థుణ్ణి పట్టాడు. త్రిమూర్తి దేవుడి విగ్రహం వెనుకనున్న శివరాజుని గుర్తించగలిగాడు.

ఆ వాసన డీయస్పీనుంచి వస్తోంది.

# 8

గోవిందరావుకు చాలా ఉక్రోషంగా వుంది. శివరాజంటే అతడికి వ్యక్తిగతంగా పగ ఏర్పడింది. ఎలాగో అలా అతడికి తగినవిధంగా బుద్ధి చెప్పాలను యెదురుచూస్తున్నాడు.

అలాంటి అవకాశమొకటి రానేవచ్చింది.

హోం మినిస్టర్ ప్రత్యేకంగా పోలీసుశాఖపై దృష్టిని కేంద్రీకరించాడు. రాష్ట్రంలో దౌర్జన్యాలు, నేరాలు

యొక్కువయ్యాయి. ఎందరో పోలీసాఫీసర్లు శ్రద్ధాసక్తులతో కృషిచేస్తూ కూడా నేరములనేమీ చేయలేకపోతున్నారు. అందుకు కారణం కొందరు ఉన్నతాధికారుల అవినీతి, నిర్లక్ష్యం!

హోం మినిష్టరు స్వయంగా క్రింది ఉద్యోగులను వ్యక్తిగతంగా కలుసుకుని వారి వారి అభిప్రాయాలను తెలుసుకోవాలనుకున్నాడు. ఆ సమావేశం యెంతో రహస్యంగా ఉంచబడుతుంది.

హోంమినిస్టరు ఆహ్వానాన్ని పురస్కరించుకుని యెందరో పోలీసు ఇన్‌స్పెక్టర్లు లిఖితపూర్వకంగా ఆయనకు ఉత్తరాలు వ్రాశారు. అవి చదివేక ఆయన అందరికీ విడివిడిగా ఇంటర్వ్యూలిచ్చాడు. ఆయన ఎప్పుడెవరినెలా కలుసుకున్నాడో అంతా రహస్యంగా ఉంచబడింది. కానీ ఆయన ఈ సమావేశాలు ప్రారంభించేక కొందరు నేరస్థులు బయటపడసాగారు. వార్తాపత్రికల్లో ఈ విషయానికి బాగా ప్రచారం వచ్చింది. ఎందరో హోంమినిస్టర్ని ప్రత్యేకంగా అభినందించారు.

గోవిందరావు కూడా హోంమినిస్టర్‌కు ఉత్తరంరాశాడు. అతడు ఉత్తరం రాసిన వారంరోజుల్లో మినిస్టర్నించి బదులొచ్చింది. బదులొచ్చిన నాలుగు రోజుల్లో అతడు హోంమినిస్టర్ని కలుసుకున్నాడు.

ఆయన అతణ్ని అభిమానంగా పలకరించి, "నీ ఉత్తరం చదివాను. నీ కర్తవ్యదీక్ష నభినందిస్తున్నాను. నేను నీకేవిధంగా సాయపడగలనో చెప్పు" అన్నాడు.

గోవిందరావు శివరాజా గురించి చెప్పాడు.

హోంమినిస్టరు తాపీగా అంతా విని, "శివరాజా

నాకు బాగా తెలుసు. ఇంతకాలం వాడు పెద్దమనిషని నమ్ముతూ వచ్చాను” అన్నాడు.

గోవిందరావు శివరాజుకి డిపార్టుమెంటులో ఉన్నత స్థాయి పెద్దలు వున్న విషయం చెప్పాడు.

“ఇది చాలా దురదృష్టకరం” అంటూ నిట్టూర్చాడు హోంమినిస్టరు.

కాసేపిద్దరమధ్యా మాటలు నడవలేదు. హోంమినిస్టరాలోచిస్తున్నాడు. గోవిందరావాయన్నే చూస్తున్నాడు.

“గోవిందరావూ! జీవితంలో నువ్వు తప్పులు చేయలేదంటావా?” అన్నాడు హోంమినిస్టరున్నట్లుండి గంభీరంగా.

ఈ ప్రశ్నకు గోవిందరావు తడబడ్డాడు. హోంమినిస్టరుద్దేశ్యం అర్థంకావడానికతడికి కాసేపు పట్టింది.

తప్పులు చేయడం మానవసహజం. మనిషి తన తప్పుల్ని తనవాళ్ళ తప్పుల్ని క్షమించగలడు. ఇతరుల తప్పుల్ని క్షమించలేడు. అదీ సహజమే!

మనిషి కొందరి తప్పులి క్షమించగలగడంవల్ల అతడిలో సహనగుణం అలవడుతుంది. కొందరి తప్పుల్ని క్షమించలేకపోవడంవల్ల కొన్ని తప్పులకు శిక్షపడుతుంది. ఆ విధంగా తప్పుకు శిక్ష వుంటుందన్న సత్యం అందరికీ తెలుస్తుంది. సామాన్యుడు తప్పులు చేయడానికి భయపడతాడు.

హోంమినిస్టరు ఓ రాజకీయపక్షానికి చెందినవాడు. తన రాజకీయపక్షం చేసిన తప్పుల్నాయన క్షమిస్తాడు. శత్రుపక్షాలు చేసిన తప్పుల్నాయన క్షమించలేడు.

“శివరాజు మా మనిషి. వాణ్ణి నేను మందలిస్తానులే!

వాడి తప్పులకు నాదీ బాధ్యత!" అన్నాడు హోం మినిస్టరు.

గోవిందరావు నిరుత్సాహపడ్డాడు. తననుకున్నకంటే గొప్పవాడు శివరాజా. అటు డిపార్టుమెంట్లో నేకాక ప్రభుత్వస్థాయిలో కూడా అతడికి మద్దతు ఉంది.

"నువ్వు శివరాజా గురించి మర్చిపో! వాడికి నా మద్దతు వుంది. నామాటమీదనే నీ డిపార్టుమెంట్లో కొందరు వాణ్ని సమర్థిస్తున్నారు. అది చూచుకుని వాడహంకరిస్తే నేనే వాణ్ని నేలమట్టం చేస్తాను. నువ్వు చెప్పింది విన్నాను కదా! ఇక నువ్వే చూద్దువుగాని!" అన్నాడు హోంమినిస్టరు.

"నేను చేయవలసిందేమన్నా ఉందాసర్!" అన్నాడు గోవిందరావు వినయాన్ని నటిస్తూ. శివరాజాని హోం మినిస్టరు నేలమట్టం చేస్తాడన్న నమ్మకం అతడికిలేదు. తనకా అవకాశం పోతోందన్న ఉక్రోషాన్నాపుకోవడం అతడికి కష్టంగా వుంది.

"మీ ఊళ్ళో శివరాజొక్కడే కాదు. ఇంకా చాలా మంది నేరస్థులున్నారు. అలాంటివాళ్ళ జాబితా ఇస్తాను. అడుగడుగునా వాళ్ళనెదుర్కొని ఇబ్బంది కలిగిస్తూండు. వాళ్ళు సమాజంలో యెంత పెద్దవాళ్ళైనా బెంగ పెట్టుకోకు. నీకు నా మద్దతు, నా పార్టీ మద్దతు ఉంటాయి. నీకు మంచి ప్రతిఫలంకూడా ఉంటుంది. చేసిన పనినిబట్టి, సాధించిన విజయాన్నిబట్టి — ఇంక్రిమెంట్లో, ప్రమోషనో!"

గోవిందరావుకు వెంటనే పార్కులో తమను కలుసుకున్న యువకుడు గుర్తొచ్చాడు.

అతణ్ని శివరాజా నియమించాడు. ప్రమాదకరమైన

కార్యాల్లో తలదూర్చి విజయం సాధిస్తే అతడికి మంచి ప్రతిఫలముంటుంది. ఆ ప్రతిఫలం శివరాజు న్యాయం గానో, అన్యాయంగానో ఆర్జించిన డాంట్లోంచి ముడు తుంది.

ఇప్పుడు శివరాజు స్థానంలో హోంమినిష్టరున్నాడు. తనదాయుకవుడి స్థానం! హోంమినిస్టరు చెప్పినట్లుచేస్తే తనకు మంచి ప్రతిఫలం. ఆ ప్రతిఫలం జీతం రూపంలో ముడుతుంది. ఆ జీతం ప్రజల సొమ్ము!

"ఛీ!" అనుకున్నాడు గోవిందరావు. కానీ పైకి ఛీ అనలేక—"సెలవు" అన్నాడు.

"నేను చెప్పే నేరస్థుల పేర్లు తెలుసుకోలేదు నువ్వు."

"చెప్పండి సర్!" అన్నాడు గోవిందరావు తెచ్చి పెట్టుకున్న వినయంతో.

హోంమినిస్టరు చెప్పాడు.

ఊళ్ళోని పెద్దమనుషుల పేర్లవి. వాళ్ళు నేరాలు చేస్తున్నారు, చేయిస్తున్నారు. ఆ విషయం గోవింద రావుకు తెలుసు.

కానీ ఒకరోజున వాళ్ళూ ఎన్నికల్లో నెగ్గి ప్రజా నాయకులైతే? అప్పుడు వాళ్ళు తనమీద పగతీర్చు కోరూ?"

గోవిందరావు సందేహం విని హోంమినిస్టరు నవ్వాడు, "ఒకసారి పదవిలోకి వచ్చేక దాన్నెలా నిలబెట్టు కోవాలో, నాకు, మా పార్టీ వర్కర్సుకు బాగా తెలుసు. ప్రజాక్షేమమే ధ్యేయంగా భావిస్తూ, పేద ప్రజలకే అంకితమైన పార్టీ మాది. మా పరిపాలన చవి చూసిన ప్రజలు మరే పార్టీనీ భరించలేరు. నువ్వు భయ

పడవ. పడవిలో వున్నా లేకపోయినా నామీద ఈగ వాలాలన్నా నా యనుమతి కావాలి. నామాట వింటే నీమీద కూడా నేనీగను వాలనివ్వను."

గోవిందరావేదో అనబోయి ఆగిపోయాడు. అప్పుడే యేదో వాసన!

ఏ వాసన సాయంతో శివరాజుని పట్టుకున్నాడో అదే వాసన!

ఆ వాసన హోంమినిస్టర్నుంచి వస్తోంది.

# 9

హోంమినిస్టరు కూడా కొంతవరకూ తనమాటను నిలబెట్టుకున్నాడు. ఆయనతో మాట్లాడివచ్చిన మూడు రోజులకు శివరాజునుంచి పిలుపువచ్చిందతడికి. శివరాజతణ్ని డిన్నరుకు పిలిచాడు. అప్పుడతడితో, "మనం స్నేహితులం. జరిగింది మళ్ళీ ముందు జరుగకుండా ఉండడం కోసమే గుర్తుంచుకుందాం. జరిగింది జరిగినట్లుగా మరిచిపోదాం. నావల్ల పొరపాట్లుంటే మన్నించమని అడుగుతున్నాను. నీవల్ల పొరపాట్లుంటే మన్నించమని అడగమనికూడా అడగను" అన్నాడు శివరాజు.

గోవిందరావు స్నేహపూర్వకంగా విడిపోయాడు. కానీ అతడి మనసుకు తృప్తిగాలేదు.

ఇటీవల శివరాజు గొడవలోపడ్డాక అతడు త్రిమూర్తి దేవుడి గుడికి వెళ్ళడం కూడా మానేశాడు.

శివరాజునుంచి డిన్నరు తీసుకున్నాక మర్నాడతడు త్రిమూర్తి దేవుడి గుడికి బయల్దేరాడు. నిజానికతడికి తీరుబడిలేదు. కేవలం మనశ్శాంతికోసం దైవదర్శనం చేసుకోవాలనుకున్నాడు.

మనిషికీ మనిషికీ మధ్య యెన్నో అంతరాలు! బల

వంతుడైన మనిషి బలహీనుణ్ని మృగంకన్న అన్యాయంగా అణచివేస్తూ కూడా మనిషి ననిపించుకోగల్గుతున్నాడు.

లేడిపిల్ల సింహాన్నేమీ చేయలేదు. తను చేయగలిగిందల్లా తప్పించుకుని పారిపోవడం!

సమాజంలో పేరు ప్రతిష్ఠలున్నవారు, ప్రజానాయకులు మృగరాజుల్లాంటి వాళ్ళు. సామాన్యులు మృగాల్లాంటివాళ్ళు.

గోవిందరావిక అన్నింటికీ దేవుణ్ణే నమ్ముకోవాలనుకున్నాడు. నేరస్థుణ్ని గుర్తించే అద్భుతశక్తిని తనకిచ్చాడు త్రిమూర్తి దేవుడు. కానీ నేరస్థుణ్ని పట్టుకుని శిక్షించగల బలాన్నివ్వలేదు.

“భగవంతుడా! నాకా బలాన్నివ్వు. లేదా నాకిచ్చిన శక్తిని వెనక్కి తీసుకో! నా చుట్టూ దొంగలను గుర్తించి కూడా ఏమీ చేయలేని అసహాయుడిగా నేను బ్రతకలేను” అనుకుంటూ అతడు గుడి వుండే ప్రాంతం చేరుకున్నాడు.

అప్పుడు గోవిందరావుకు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు.

ఆ ప్రాంతమంతా యాత్రాస్థలంలా వుంది. అక్కడ యెన్నో దుకాణాలు. కొబ్బరికాయలు, అరటిపళ్ళు, పిల్లల ఆటవస్తువులు వగైరాలెన్నో ఎన్నో

గుడిముందు జనం ఇసుక వేస్తే రాలనట్లుగా వున్నారు.

దైవదర్శనానికి పెద్ద క్యూ యేర్పాటు చేయబడింది.

గోవిందరావుకు క్యూలో జాయినయ్యేందుకు మనసొప్పలేదు. అదతడి కలవాటులేనిపని!

పక్కనే వున్న దుకాణం వాణ్ని పలకరించి, “కొద్ది వారాల క్రితం ఇక్కడంతా నిర్మానుష్యంగా ఉండేది,

ఇప్పుడేమయింది!" అడిగాడు.

"త్రిమూర్తి దేవుడు మహిమాన్వితుడు బాబూ! ఆయన తల్చుకుంటే రాజును పేదచేయగలడు, పేదను రాజు చేయగలడు" అంటూ ఆ దుకాణంవాడు కొన్ని నిదర్శనాలు కూడా చెప్పాడు. వాటిలో పూజారి కూతురి పెళ్ళి, గోవిందరావు నేరస్థుల్ని పట్టుకోవడం కూడా వున్నాయి.

క్యూ అంతా క్లియరయ్యేవరకూ అక్కడే యెదురు చూశాడు గోవిందరావు. గుడి మూసేశాక అతడు పూజారిని కలుసుకున్నాడు.

"మీరు దర్శనానికి వచ్చినట్లు లేదే?" అన్నాడు పూజారి.

"గర్భగుడిలో దేవుణ్ని దర్శించుకునేందుకలవాటు పడ్డవాణ్ని. క్యూలో నిలబడి హడావుడిగా చూసి వెళ్ళలేకపోయాను" అన్నాడు గోవిందరావు.

"ఇక మీదట ఇంతే! శివరాజా చేసిన ప్రచారంతో త్రిమూర్తి దేవుడికి విద్యారంగంనుంచి, రాజకీయ రంగం దాకా పేరొచ్చేసింది; జనాలు తండోపతండాలుగా వచ్చేస్తున్నారు. ఇది కలియుగం గోవిందరావుగారూ! దేవుడికి పేరు రావాలన్నా మనబోటివాళ్ళ ప్రచారం ఫలించదు. స్మగ్లర్లు అవినీతిపరులు, సంఘద్రోహులు— వీళ్ళే దేవుడికి ప్రచారం చేయగలవారు. రండి—మీరు దేవుణ్ణి దర్శించుకుందురుగాని" అన్నాడు పూజారి.

"మీరు చెప్పింది నిజమే! అటువంటి స్మగ్లర్ను, అవినీతిపరులు సంఘద్రోహులను గుర్తించగల శక్తి నాకిచ్చాడు త్రిమూర్తి దేవుడు. వాళ్ళను శిక్షించగల బలం కూడా నాకివ్వమని ఆ దేవుణ్నే కోరుకోవాలి, పదండి"

అంటూ లోపలకు నడిచాడు గోవిందరావు. అయితే గర్భ గుడిలోకి అడుగు పెట్టగానే, "వాసన, నేరస్థుడి వాసన" అన్నాడతడు.

ఎంత వెదికినా విగ్రహం వెనుకగానీ, గర్భగుడిలో మరెక్కడగానీ నేరస్థులెవ్వరూ కనబడలేదు.

తనకు వేస్తున్న వాసన త్రిమూర్తి దేవుడి విగ్రహం నుంచే వస్తున్నదని గోవిందరావు గ్రహించడానికి ఎంతో సేపు పట్టలేదు.

—:అ యి పో యి ం ది:—

# రాకాశి వేళ్లు

కె.వి.యస్.యన్. మూర్తి

బుజ్ మార్గ్ ........

మధ్యప్రదేశ్ రాష్ట్రంలో బస్తర్ జిల్లాలో నాగరికతకు సుదూరంగా వున్న ఆటవిక గూడెం.

అక్కడి ప్రజలకు మాయామర్మం తెలియదు. నాగరికత పెరుగుతో వున్న ప్రాంతాల్లో అడుగడుక్కీ కనిపించే మోసాలూ దోపిడీలూ....యిక్కడ మచ్చుకయినా కనిపించవు. ఇచ్చటి ప్రజలు ఎదుటి వ్యక్తిని నమ్మారో ప్రాణం పెడతారు. ఎదుటి మనిషిలో ఏమాత్రం వారికి నమ్మకం తగ్గినా ఆ మనిషిని నిలువునా చీరేస్తారు. అసలు నాగరిక ప్రజ ఆ గూడెంలోకి అడుగు పెట్టదు. వాళ్ళు ఆ చుట్టుప్రక్కల గూడెం మనుష్యుల్ని తప్ప నాగరిక జాతిని తమ గూడెంలోకి అడుగు పెట్టనివ్వరు.

చుట్టూ ఎత్తుగా పెరిగిన కొండలూ, వాటి మధ్య ప్రవహించే నదీజలాలూ, వింతయిన పక్షులూ; అరుదుగా కనిపించే రకరకాల మొక్కలూ, ఈ ప్రాంతానికి ఒక

వయిపున శోభను కూరుస్తూ వుంటే, దట్టమయిన శారద వులూ....క్రూరమృగ నిలయమైన యితర ప్రదేశాలూ ఈ ప్రాంతంచుట్టూ ఆవరించి అతి భీతావహుతిని గొల్పుతో వుంటాయి.

ఉదయం ఆరుగంటలయింది.....

సూర్యుని లేలేత కిరణాలు, ఎత్తయిన రాక్షసి వృక్షాల మీద పడి, అంతంత మాత్రంగా వున్న తమ తీవ్రతను కోల్పోయి, దిశలను మార్చుకొని, చెట్ల క్రింద సుంద్రటి, తెల్లనయిన నమూనాలను ఏర్పరుస్తోన్నాయి. వాతావర ణంలో తేమ యింకిపోయి, వీస్తోన్న గాలుల్లో చలిని నింపుతోంది.

అప్పటికే ఆరంభమయిన పక్షుల కిలకిలా రావాలు వుధృతమయ్యాయి.

అది గూడానికి చాలా దూరంగా వున్న ప్రాంతం. అటువయిపు సాధారణంగా నగసంచారం వుండదు. ఆ ప్రాంతాన్ని సంబరాల కొలనంటారు. అక్కడ సంవత్స రానికి ఒక్కసారి ఆ చుట్టుప్రక్కలున్న ఆరుగూడేల వారు తమ ఆరాధ్య దైవమయిన దంతేశ్వరీదేవి సంబరం జరుపుకొంటారు. మిగతా మూడొందల అరవై నాలుగు రోజులూ ఆ ప్రాంతంవయిపు యెవరూ రారు. వచ్చారో వాళ్ళ ఆయువు మూడినట్లే. దంతేశ్వరీదేవి ఆ ప్రాంతంలో యేదో జంతురూపంలో సంచరిస్తో వుంటుందనీ, ఆ సమ యంలో ఎవరయినా ఆమె కంట పడితే ఆమె వారి అంతు చూస్తుందనే వారి నమ్మిక. ఆ నమ్మికమాట ఎలా వున్నా ఆ ప్రాంతంమాత్రం చాలా భయంకరమయింది. బస్తర్‌లో వున్న క్రూరమృగాల్లో హెచ్చుశాతం ఆ ప్రాంతంలోనే వుంటాయి,

అటువంటి భయంకర వాతావరణంలో వాళ్ళిద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ నడుస్తోన్నారు. దాదాపుగా మూడు రోజులనుండి విసుగూ విరామం లేకుండా నడుస్తూనే వున్నారు.

ఆ భీకరారణ్య మధ్యమంలో అతడికి ఆమె; ఆమెకు అతడు—తోడు.

అతని పేరు జయకర్—ఫార్మకాలజీలో రీసెర్చ్ చేస్తోన్నాడు. ఆమె పేరు మిత్రభాను. హౌస్ సర్జన్సీ చేస్తోంది. ఇద్దరూ బావామరదళ్ళు. ఈవాళో రేపో పెద్దలు ఆశీర్వదించబోతోన్నారు.

బుష్ మార్గ్ ప్రజలకు అనేకరకాలయిన పసర్లూ, మూలికల గురించి తెలుసు. వాళ్ళు తమకు తెలిసిన విషయాలను తమవరకే పరిమితం చేసుకొన్నారు. ఆ విషయం మరొకరికి తెలియటం యిష్టంలేదు—వారికి.

ఆ గూడెంలో కొయిలా జాతి ప్రజలు వైద్య వృత్తిని తరతరాలుగా కొనసాగిస్తోన్నారు. తమకు తెలిసిన విద్య తమ వారసునికి మాత్రమే వాళ్ళు తెలియచెబుతారు. గూడెంలో యే రోగొచ్చినా కొయిలారులే మందివ్వాలి. ఇదిగాక వీళ్ళకి మంత్రతంత్రాలు కూడా వచ్చు. అందుకే ఆ చుట్టుప్రక్కల వారికి కొయిలార్లు దైవాంశ సంభూతులుగా లెక్క.

కొయిలారులు అతి భయంకరమయిన మనుషులు. వీరు అందరితోపాటు దంతేశ్వరీదేవిని ఆరాధించినా, వారి కులదేవత కొయిలామాత. ఆమెకు వారం వారం జంతు బలుల్ని, నరబలుల్నీ యిచ్చి ఆమెను ప్రసన్నం చేసుకుంటూ వుంటారు.

ఆ కొయిలారులు ఉపయోగించే పసరుల గురించి

తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో సరిగ్గా మూడు నెలల క్రితం వాశిష్టశాస్త్రి బుక్ మార్గ్ బయలుదేరి వచ్చాడు. బయలుదేరేముందు జయకర్‌ని తన గదికి పిలిచాడు. ఆయన జయకర్‌కు రీసెర్చి గైడ్.

"మిస్టర్ జయకర్! కూర్చో!" అన్నాడు వాశిష్ట శాస్త్రి.

తమ ఆరు సంవత్సరాల సాహచర్యంలో ఆయన జయకర్‌తో యెప్పుడూ అంత తాపీగా మాట్లాడలేదు.

జయకర్ కూర్చున్నాడు.

అప్పుడు వాశిష్టశాస్త్రి అతడికి బుక్ మార్గ్ గురించి కొయిలారుల గురించి వివరంగా చెప్పాడు. "ఆ అమూల్య మయిన మూలిక రహస్యాలు ఒకరి సొత్తవటం మంచిది కాదు. ఆ కొయిలారుల చేతిలోనే ఆ రహస్యాలు ఉండి పోతే వారు వందమందికి ఉపకారం చెయ్యగలరు, వెయ్యి మందికి చెయ్యగలరు. ఆ రహస్యాలను మనం సంపా దించాలి. వాటిని విశ్వవ్యాప్తం చెయ్యాలి" అన్నా డాయన ఆవేశంగా.

"మరెలా సార్! మీరే చెబుతోన్నారు వారు తమ రహస్యాలను బయట పెట్టరని?" అన్నాడు జయకర్.

"అవును వారు బయట పెట్టరు. కానీ మనం తెలుసు కోవాలి. అందుకే నేను ఈ రోజే బుక్ మార్గ్ బయలు దేరుతోన్నాను" అన్నాడు వాశిష్టశాస్త్రి.

"సార్! మీరు చేస్తోన్న పని ..."

"నాకు తెలుసు ప్రాణాపాయమని. అయినా నేను ఈ పని చెయ్యటానికి నిశ్చయించుకున్నాను. ప్రజోపకర మయిన రహస్యాలు భూస్థాపితం అయిపోవటానికి నా మనసంగీకరించటంలేదు."

"సార్! నేను మీకు చెప్పాల్సినంతటి వాడినికాను. -నీ...."

"చూడు జయకర్ నేను నిన్ను పిలచింది నాకు హిత
ోధ చెయ్యటానికికాదు. నేను చెప్పేది జాగ్రత్తగా
ను. నేను మూడు నెలలలోగా తిరిగి రాకపోతే నువ్వు
ఈ భారాన్ని మొయ్యాలి. ఇది కోరరాని కోరిక అయినా,
మీద ఉన్న నమ్మకంకొద్దీ అడుగుతున్నాను. చేస్తావు
దూ!" అన్నాడు వాశిష్ట. అలా అంటోన్నపుడు అతడి
ళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

"ఛ! ఎంతమాట మాస్టారూ! మీరు నిప్పుల్లో దూక
మన్నా దూకుతాను. మీకా సందేహం అవసరం లేదు"
అన్నాడు జయకర్.

"నాకు తెలుసయ్యా! నువ్వు నా మాటకు గౌరవం
యిస్తావని. అందుకే నాకు తప్ప మరో మనిషికి తెలియని
విషయాలన్నీ నీకు వివరించి చెప్పాను" అన్నాడు వాశిష్ట
సంతోషంతో ఊగిపోతూ.

కానీ వారి సంభాషణంతటినీ ఒక వ్యక్తి పొంచివుండి
విన్నాడని వారిద్దరికీ తెలియదు. తెలిసినట్లయితే ఈ రోజు
యిన్ని కష్టాలు ఉండేవికావు.

"భామా!" పిలిచాడు జయకర్.

"ఏమిటి బావా?" బద్ధకంగా అడిగింది మిత్రభాను.
ఆమె చాలా నీరసంగా ఉంది. నీడపట్టున హాయిగా
పెరుగుతోన్న సుకుమారి యిలా అడవులనుపట్టి తిరగటం
కష్టమేమరి.

ఇదే విషయాన్ని జయకర్ ఒకటి రెండుసార్లు
ఆమెతో అంటే "బావా! నేను సీతకన్నా గొప్ప
దాన్నా? రాముడి గురించి సీత ఎన్ని కష్టాల్ని పడిం

చెప్పు. నీ గురించి నేను ఈమాత్రం చెయ్యలేనా!" అనేసింది నవ్వుతూ.

"భానూ! బాగా వెలుగొచ్చేసింది. ఇక మనం ముందుకు వెళ్ళటం ప్రమాదం. చీకటిపడేవరకూ విశ్రాంతి తీసుకుని, చీకటిపడ్డాక మళ్ళీ బయలుదేరుదాం" అన్నాడు జయకర్.

మిత్రభాను సంతోషంగా నిలబడ్డచోటే కూలబడింది.

జయకర్ ఆ చుట్టుప్రక్కలనుండి ఎండు చితుకులను పోగేసుకు వచ్చాడు. వాటిని వెలిగించి పది నిమిషాల్లో కాఫీ తయారుచేశాడు. వేడివేడిగా కాఫీత్రాగి మరో గంటలో వారిద్దరూ నిద్రలోకి జారుకున్నారు.

## 2

రాత్రి పదకొండు గంటలు దాటింది.

ఊరికి దూరంగా ఉన్న ప్రాంతం అది. అక్కడక్కడ విసిరి పారేసినట్టు, దూరదూరంగా ఉన్నాయి యిళ్ళు. అది ఇంకా క్రొత్తగా తయారవుతోన్న కాలనీ. ఇంకా కొన్ని ఇళ్ళు నిర్మాణంలో ఉన్నాయి. ఆ కాలనీ చివరగా అప్పుడే కట్టిన భవనం. బయటకు మామూలుగా కనిపించినా లోపల అనేక రకాలయిన ఆధునిక అమరికలున్నాయి.

ఆ భవంతిలో ఉన్న హాలులో కాలుగాలిన పిల్లిలా పచార్లు చేస్తోన్నాడతడు. ఎర్రబడ్డ కళ్ళు, రేగిపోయిన జుత్తు అతనిలో ఉన్న బాధను పైకి చాటి చెబుతోన్నాయి. అతడు నిముషనిముషానికీ గుమ్మంవయిపు చూస్తోన్నాడు. ఆలస్యాన్ని భరించలేనట్లు చిందులు త్రొక్కుతున్నాడు. ఆ క్షణంలో అతడిని చూసినవాళ్ళెవరూ— అతడో డాక్టరని గానీ, ఒక ప్రముఖ పారిశ్రామికవేత్త

కొడుకని గానీ—అనుకోరు. అతడో గూండాలా, కిడ్నే పర్ గా కనిపిస్తాడు.

సరిగ్గా పదకొండున్నర అవుతోందనగా గుమ్మం దగ్గర అలికిడయింది. "ఒరేయ్! సత్తిబాబూ! ఏమయిందిరా?" అన్నాడతడు లోపలకి వస్తోన్నతడిని చూసి.

"సారీరా! శేఖర్!" సత్తిబాబు రొప్పుతోన్నాడు.

"ఏమయిందో చెప్పి చావు!" శేఖర్ అతడి వంక అసహనంగా చూశాడు.

"ఆ జయకర్ గాడు దాన్ని యెక్కడకో లేపుకు పోయాడు."

శేఖర్ దవడకండరాలు బిగుసుకున్నాయి. "ఒరేయ్! నీ అంతు చూస్తాన్రా!" మెల్లగా అన్నాడనుకున్నాడు శేఖర్. కానీ ఆ గొంతులోని తీవ్రతకు సత్తిబాబే కంగారు పడ్డాడు.

అతడికి ఆ క్షణంలో మిత్రుడికి ఏం కావాలో తెలుసు. గబగబ లోపలకు వెళ్ళాడు సత్తిబాబు. అల మార్లోంచి రోయల్ రిజర్వ్ తీశాడు. ఫ్రిజ్ లోంచి సోడాలు తీసుకువచ్చి టీపాయ్‌మీద పెట్టాడు.

శేఖర్ వాటి వంక అయిష్టంగా చూశాడు.

"గురూ! నువ్వేం దిగులు పడకు. ఆ జయకర్ గాడి సంగతి నాకు వదిలెయ్!" అంటూ గ్లాసుల్లో ద్రవాన్ని వంపి, సోడా కలిపాడు.

"వాళ్ళెక్కడికెళ్ళారో తెలుసా?" అడిగాడు శేఖర్.

"లేదు గురూ! జయకర్ ఇంత తెగిస్తాడని అనుకో లేదు."

"ఛీ.ఛీ పిచ్చినాయాలా! ఇందులో తెగించేది ఏముంది?

అందరూ ఇష్టపడినట్లున్నారు. ఇద్దరూ కలసి ఎక్కడికో వెళ్ళారు."

"మరో ఇంట్రెస్టింగ్ విషయం గురూ!"

"ఏమిటది?"

"జయకర్ వాళ్ళ గయిడ్—వాశిష్ట శాస్త్రి కూడా ఊళ్ళో లేడు."

శేఖర్ పెదాలమీద చిన్న చిర్నవ్వు నాట్యం చేసింది. కళ్ళలో అదోరకమయిన జీర చోటుచేసుకుంది. "వాశిష్ట శాస్త్రి!" అన్నాడు కసిగా.

"అయ్యో! అతని ప్రస్తావన తీసుకువచ్చి నీ మూడ్ పాడుచేశానా?" బాధపడ్డాడు సత్తిబాబు.

"లేదురా! సరయిన టయిముకే గుర్తు చేశావు."

సత్తిబాబు మౌనంగా ఉండిపోయాడు.

సరిగ్గా నాలుగు నెలల క్రిందట జరిగిన సంఘటన ఇది.

ఆ రోజు కాలేజీ వార్షికోత్సవాలు జరుగుతున్నాయి. మెడికల్ కాలేజీ విద్యార్థినీ, విద్యార్థులు దానిని ఓ పండుగులా జరుపుకొన్నారు. ఉత్సవాలు ముగిసేటప్పటికి రాత్రి బాగా పొద్దుపోయింది. మిత్రభానును 'ఇంటి దగ్గర దింపుతాను కారెక్క'మన్నాడు శేఖర్. అతని మీదున్న నమ్మకంకొద్దీ మిత్రభాను అతని అభ్యర్థనను మన్నించింది. కానీ ఆ నమ్మకం ఎంతోసేపు నిలబడలేదు.

కారును ఒక బంజరు దగ్గర ఆపి, మిత్రభానును తమకంగా చూశాడు శేఖర్. ఆమె జరగబోయేది వూహించింది. కానీ బెదిరిపోలేదు. తనమీద అతడు పట్టు సాధించేలోగా విజృంభించింది. అతనిని ఎడా పెడా వాయించేసింది. అతడు కోలుకొని పళ్ళు కొరికాడు. మరికొంతసేపు ఆగితే యేమయ్యేదోగాని, అతడా మెను

దొరకబుచ్చుకొందుకు ముందుకు వచ్చేలోగా ఒక కారొచ్చి అక్కడ ఆగింది. కారులోంచి వాశిష్టశాస్త్రి క్రిందకు దిగాడు.

"అంకుల్!" అంటూ అతడిని పట్టుకొని బావురుమంది మిత్రభాను.

వాశిష్టశాస్త్రి, శేఖర్ చెంపలు పగులకొట్టేడు. జరిగింది జరిగినట్లుగా శేఖర్ దగ్గరనుండి రిటెన్‌గా కమిట్‌మెంటు తీసుకున్నాడు. అంతటితో ఊరుకొన్నా బావుణ్ణు. శేఖర్ ఇంటికి వెళ్ళి నానా హడావుడీ చేశాడు. శేఖర్ తండ్రి ఈశ్వరప్రసాద్ తన హోదానూ, పరువునూ మర్చిపోయి కనపడ్డవాళ్ళ కాళ్ళన్నీ పట్టుకొన్నాకగాని వాశిష్టశాస్త్రి తన పంతాన్ని వదలలేదు. పైగా శాస్త్రి, ప్రసాద్‌లు 'ఒరేయ్, ఒరేయ్,' అనుకునేంత స్నేహితులు. శేఖర్ విషయంలో శాస్త్రి స్నేహాన్ని కూడా లెక్క చెయ్యలేదు.

"నీకున్నలాంటి కొడుకే నాకూ వుంటే ముక్కలు క్రింద నరికి ప్రోగులు పెడుదును" అన్నాడు వాశిష్ట శాస్త్రి.

ఆ సంఘటన జరిగిన దగ్గరనుండి శేఖర్‌కు యింట్లో అసలు గౌరవం లేకుండా పోయింది.

"ఒరేయ్ నా పరువును తీసేసిన శాస్త్రిగాడిని మామూలుగా వదలను. చూస్తూవుండు ముక్కముక్కలు చేసి పారేస్తాను" అన్నాడు శేఖర్.

సత్తిబాబు చిన్నగా నవ్వాడు. "అసలు విషయం వదిలేసి నువ్వు మాస్టారిమీద పడ్డావేమిటి?" అన్నాడు.

"అక్కడే ఉంది మెలిక. వన్ షాట్ త్రి బర్డ్స్.

శాస్త్రి ఆమెవయిపు తిరిగాడు. "నువ్వా?...." అన్నాడు.

"ఏం గుర్తులేనా?" అడిగింది సుందరి.

శాస్త్రి గొంతులో తడారిపోయింది. "ఏం ఏం.... ఏం కావాలి?" అన్నాడు మాటలు కూడగట్టుకునే ప్రయత్నంలో.

సుందరి విలాసంగా నవ్వింది. మంచంమీద శాస్త్రి ప్రక్కగా కూర్చుంది. అలా కూర్చున్నప్పుడు వంటి మీదున్న ఆచ్ఛాదన కాస్త క్రిందకు జారిపోయింది.

శాస్త్రి ఆమెను అసహ్యంగా చూసి దూరంగా జరిగాడు.

సుందరి కళ్ళలోంచి నిప్పులు రాలాయి.

"ఏం అప్పుడులేని సిగ్గు, అభిమానం ఇప్పుడు ముంచుకొచ్చాయా అయ్యగారికి?" అంది రుసరుసలాడుతూ.

శాస్త్రి బాధగా కళ్ళు మూసుకున్నాడు.

సరిగ్గా ఆరునెలల క్రితం జరిగిన సంఘటన అతని కళ్ళ ముందు మెదిలింది.

అవి వేసవి రోజులు.

యూనివర్సిటీ హాస్టల్సు మూసేశారు.

ఆ రోజు—డిపార్టుమెంట్ లో శాస్త్రి ఒక్కడే వున్నాడు.

అప్పుడు మెరుపుతీగలాంటి అమ్మాయి లోపలకు వచ్చింది. "నమస్కారం సార్!" అంది.

వాలిప్టశాస్త్రి ఆమెవైపు చూసి "ఏం కావా లమ్మా?" అన్నాడు.

"నేను ఉత్కళ్ లో బయోకెమిస్ట్రి చేశాను సార్! ఇంటిర్ డిసిప్లనరీగా ఫార్మసీలో రిసెర్చి చెయ్యాలనుకొం

టోన్నాను. దానికి యెంతవరకూ అవకాశం వుందో తెలుసుకుందామని వచ్చాను" అంది సుందరి.

"ఏ యేరియాలో?" శాస్త్రి సబ్జెక్టులోకి దిగి పోయాడు.

"ఎడిక్షన్స్ మీద!"

"మంచి సబ్జక్టమ్మా! కానీ నాకు దాంతో పెద్దగా పరిచయం లేదు. రెడ్డిగారని—ఆయనకు కొంచెం పరిచయముంది. ఆయన నీకు ఎక్స్టర్నల్ గైడ్ గా వుంటారు. నీ ఫాకల్టీ నుండి, ఇంటర్నల్ గైడ్; కావాలి. ఇద్దరు గైడులూ, సంబంధిత హెడ్ లూ వాళ్ళ ఆమోదాల్ని పంపాలి. తర్వాత విషయాన్ని బోర్డు ఆఫ్ రిసర్చ్ స్టడీస్ ముందు వుంచుతారు. ఛైర్మన్ నాకు బాగా తెలుసు. నేను రికమెండ్ చేస్తాను" అన్నాడు శాస్త్రి.

"థాంక్స్, మాస్టారూ!" అంటూ సుందరి బాగ్ లోంచి చాక్లెట్ తీసి ఇచ్చింది.

శాస్త్రి చాక్లెట్ తీసుకుని చప్పరించాడు. అంతే కళ్ళు తిరిగినట్లయింది.

మెలకువ వచ్చి చూసేటప్పటికి యెదురుగా సుందరి యేడుస్తూ వుంది. జుత్తు రేగిపోయి, బట్టలు చిరిగిపోయి వున్నాయి.

"ఏం జరిగింది?" అన్నాడు శాస్త్రి గాభరాగా.

"ఏముంది? ఆడపిల్లను—ఒంటరిగా దొరికాను. మీ పశుబలం నామీద ప్రయోగించారు. ఓడిపోయాను" అంది సుందరి వెక్కిళ్ళ మధ్య.

శాస్త్రి నీరుగారిపోయాడు. జీవితంలో అతను ఇటువంటి పనికి యేనాడూ పాల్పడలేదు. తను అంత నీచమైన పని చేస్తానని అతనికి నమ్మకంలేదు. కానీ ఎదురుగా

ఒక ఆడపిల్ల 'నన్ను పాడుచేశావని' చెబుతోంటే నమ్మక యేం చేస్తాడు? నిట్రాటలా నిలబడిపోయాడు.

విషయం పదిమందికీ తెలిస్తే తన పరువేం కావాలి?

సుందరి యేడుస్తూనే వెళ్ళిపోయింది. మళ్ళీ ఇప్పుడు ప్రత్యక్షమైంది.

"ఈమె ఈ అడవి మధ్యకు యెందుకు వచ్చింది? యెలా వచ్చింది?...." శాస్త్రి మెదడులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

అతడి ఆలోచనలను పసిగట్టినట్లు సుందరి చిన్నగా నవ్వింది. "ఆ మూలికల గురించి వివరంగా చెప్పండి! మీరు నాకు చేసిన అన్యాయం గురించి మర్చిపోతాను" అంది.

శాస్త్రి పళ్ళు పటపటా కొరికాడు. అతడికి ఇప్పుడర్థమవుతోంది. తను యే తప్పూ చెయ్యలేదు. సుందరిని ప్రీప్లాన్డ్‌గా తనమీద ప్రయోగించారన్నమాట. ఆ చాక్లెట్ తినగానే స్పృహపోయింది. అప్పుడే తను అనుమానించాల్సింది. "తప్పు చేశానేమో!" అన్న బాధ అతనికి ఆ క్షణంలో మాయం అయ్యింది. శాస్త్రి ఆమెను చూసి "పెళ్ళి కావలసిన పిల్లవి? ఎందుకు నిండు జీవితాన్ని ఇలా తగలేసుకొంటావు?" అన్నాడు జాలిగా.

సుందరి కిలకిలా నవ్వింది. "ఆ బాధ మీ కెందుకు గానీ ముందు నే నడిగిన దానికి సమాధానం చెప్పండి!" అంది.

"దయచేసి ముందు నువ్వు బట్టలు కట్టుకో!" అన్నాడు అసహ్యంగా. ఆమెవయిపు తన చొక్కాను విసిరాడు.

ఆమె ఆ చొక్కాను నిర్లక్ష్యంగా అందుకుని తొడు

క్కుంది. పావడాను లుంగీలా చుట్టుకుంది. "చెప్పండి!" అంది.

"సారీ! ఆ విషయాలు చెప్పాల్సింది మీకు కాదు."

సుందరి అదోలా నవ్వింది. "యూనివర్సిటీలో నీ పరువేం అవుతుందో ఆలోచించుకో!" అంది.

శాస్త్రి ఆమెను నిర్లక్ష్యంగా చూశాడు. "ఏమైనా పర్వాలేదు" అన్నాడు.

తన ప్రయత్నం ఫలించలేదని తెలిసి రాబర్టు కోపంతో ఊగిపోయాడు. శాస్త్రి దగ్గరకు వచ్చాడు. "నీ కెంత కావాలో చెప్పు" అన్నాడు.

శాస్త్రి మాట్లాడలేదు.

"చూడు ప్రొఫెసర్! నా సంగతి నీకు తెలియదు. అనవసరంగా ప్రాణంమీదకు తెచ్చుకోకు" అన్నాడు.

శాస్త్రి మాట్లాడలేదు. రాబర్టు కత్తిని బయటకు తీశాడు. "నేను పది అంకెలు లెక్క పెడతాను. ఆలోగా నువ్వు ఆమోదాన్ని తెలపాలి. లేకపోతే మొండెం నుండి నీ తల వేరవుతుంది" అంటూ అంకెలు మొదలు పెట్టసాగాడు.

"వన్ ...."

శాస్త్రికి చాలా విచిత్రంగా అనిపించింది. తను కోయిలార్లకు, మిగిలిన ఆటవికులకు భయపడ్డాడు. కానీ తన ఊహ తారుమారయింది. ఎంతో స్నేహితుడుగా భావించే ఈశ్వరప్రసాదే తనను అంతం చేయిస్తున్నాడు.

"టూ ...."

రాబర్టు, శాస్త్రివైపు చూశాడు.

శాస్త్రి నిర్మలంగా కూర్చొని వున్నాడు. వాళ్ళకు ఆ

విషయం చెప్పటం కంటే ప్రాణాలు వదలటం మేలు.

అతని నిబ్బరం చూస్తోంటే రాబర్టుకు ఒళ్ళు మండి పోతోంది. తను విదేశీ ఏజంట్లకు ఆ మూలికలను నాలుగు రోజులలో అందిస్తానన్నాడు. కానీ ముసిలోడు చూస్తే మంచి పట్టుమీద వున్నాడు. భయపెట్టినా లొంగడు. అలాంటివాడు బ్రతికుండటం అనవసరం.

"త్రీ.... ఫోర్ ...."

అతడి స్వరం చావుబాకాలా వుంది.

"ఫైవ...."

"..........."

"సైన్ "

ఈశ్వరప్రసాద్ వాళ్ళిద్దర్నీ మార్చి మార్చి చూస్తో న్నాడు. అతని అనుచరులు ఇద్దరూ స్పృహ కోల్పోయి స్తంభానికి వ్రేలాడుతోన్న జయకర్ ప్రక్కన నిలబడి వున్నారు.

అక్కడ జరిగే కథంకంతో తనకు యేమీ సంబంధం లేనట్టు మందిరం గోడకు చేరబడి చూయింగ్ గమ్ నవులు తోంది సుందరి.

"టెన్ ..." అన్నాడు రాబర్టు.

అతడి చేతిలోని కత్తి పైకి లేచింది.

శాస్త్రి కళ్ళు మూసుకొన్నాడు....

అంతా స్మశాన నిశ్శబ్దం ఆవరించింది....

దేశానికి ఎంతో ఉపయోగకరమైన మహా మేధావిని అంతం చెయ్యటానికి రాబర్టు కత్తిని క్రిందకు దించ బోయాడు.

క్షణంలో పదోవంతు ఆలస్యం అయితే ఏమయ్యేదో గాని "మిస్టర్! కత్తిని క్రింద పడేసి మర్యాదగా

చేతులు పైకెత్తు!" అన్న గర్జన వినబడి రాబర్టు వెనక్కు తిరిగాడు.

అంతే ఆశ్చర్యంగా మొహం పెట్టాడు.

ఈశ్వరప్రసాద్‌కు జరుగుతోన్నది అర్థం కావటం లేదు.

"ఊఁ!" అందరూ చేతులు ఎత్తండి!"

రాబర్టు కత్తిని క్రింద పడేశాడు.

అపరకాళిలా పిస్తోలు పట్టుకుని వున్న మిత్రభానును భయం భయంగా చూశాడు.

## 14

గూడెం నాయకుడు కోపంతో పూనకం వచ్చినట్లు వూగిపోతున్నాడు. అతని ఆన్నేళ్ళ అనుభవంలో ఇలా ఎన్నడూ జరగలేదు. బలిజీవాలు మూడు తప్పించుకు పారిపోయాయి. దేవతకు కోపం వచ్చినట్లుంది. తమ గూడాలను సర్వనాశనం చేసేస్తుంది. ఎలాగయినా ఆ నాగరికులను పట్టుకు తీరాలి. దేవతను వాళ్ళ రక్తంతో తడపాలి. అప్పుడుగాని దేవత శాంతించదు.

పిచ్చిగా పరుగెడుతోన్న తనవాళ్ళందర్నీ వెనక్కు పిలిచాడు.

అందరూ నాయకుడి ముందు గుమిగూడారు. అందరి మొహాల్లోనూ, సిగ్గు....కోపం....అవమానం.... మేళవించి వున్నాయి.

అందరూ సై అంటే సై అన్నారు.

"వచ్చిన నాగరికులు మామూలు వేటగాళ్ళు కాదు. మనమీద పగబట్టారు. మనల్ని తుదముట్టించేదాకా విశ్రమించరు. కాబట్టి వాళ్ళకన్నా ముందే మనం మేలుకోవాలి" నాయకుడు ఇంకా ఏదో చెబుతూన్నాడు.

అంతలో మరో గూడెం నాయకుడు, ఎరుకవంప ముందుకు వచ్చి, పెద్ద నాయకుడికి మోకరిల్లి ప్రమాణం చేశాడు.

"ఏం దొరా? కులాశానా?" అడిగాడు పెద్ద నాయకుడు.

"కులాశానేగాని దొరా! నాకు ఇప్పుడు ఇద్దరిమీద అనుమానం గుంది" అన్నాడు.

"విపులంగా చెప్పు!"

"ఇద్దరు మనవోళ్ళలాగానే కాన్నాళ్ళగా మనతో మసిలారు దొరా! ఆళ్ళు ఈ మధ్యకాలంలో కనిపించటం లేదు."

పెద్దనాయకుడి భృకుటి ముడివడింది.

వెంటనే ఆరు గూడాల నాయకులూ అక్కడ సమావేశం అయ్యారు. కొద్దిగంటలలో, వాశిష్ఠశాస్త్రి, ఈశ్వర ప్రసాద్‌ల గురించి పూర్తి సమాచారం తెలిసిపోయింది.

వాళ్ళు యెందుకు వచ్చారో మాత్రం వాళ్ళకు అర్థం కాలేదు.

కాయిలార్ల దొర మాత్రం ఏదో అనుమానం వచ్చినట్లు మొహం పెట్టి ఎరుకవంప వయిపు తిరిగాడు. "నీకు పాము కరచినప్పుడు వాడిన వేళ్ళు యేమయ్యాయి? కాల్చేశావా?" అడిగాడు.

ఎరుకవంప మొహం తెల్లగా మారిపోయింది. "అవును, ఆటిని ఆడే తీసుకెళ్ళాడు". అతడి మనసులో అటవికుని వేషంలో వున్న వాశిష్ఠశాస్త్రి మెదిలాడు.

"రాకాశి ఏళ్ళు.... రాకాశి ఏళ్ళను ... ఎత్తుకెళ్లారట" జనంలో గుసగుసలు అరంభమయ్యాయి. అందరికీ భయం

కరమయిన కోయిలామాత కనిపించింది.

ఆ మాలికలను అందరూ రాకాశి వేళ్ళంటారు. అవి ఒక పెద్ద చెట్టు మొక్క వేళ్ళు. ఆ అతి పెద్ద చెట్టుకు కోయిలార్లు రాకాశి చెట్టు అని పేరు పెట్టారు. దాని వేళ్ళు రాకాసి వేళ్ళయ్యాయి.

ఇంతలో మరొక మనిషి ముందుకు వచ్చాడు. "దొరా! మన దంతేశ్వరి మందిరంకాడ ఎవరో వుంటోన్నట్టు నాకు అనుమానం" అన్నాడు:

అంతే పెద్దదొర మొహం కందగడ్డలా తయారయ్యింది.

"ఒరేయ్! మనం ఈ రోజు చీకటేల ఆ మందిరాన్ని చుట్టబెడదాం. మీరంతా తయారవండి" అన్నాడు.

అందరూ తలలు వూపారు.

అప్పుడు సమయం ఉదయం తొమ్మిది గంటలు దాటింది.

• • •

ఆ మైదానం ప్రక్కనే వున్న బండరాయి చాటున నక్కి కూర్చున్నాడు సత్తిబాబు.

వాళ్ళ భాష తనకు అర్థం కాకపోయినా వాళ్ళు మాట్లాడుకొనేది తమ గురించే—అని అర్థం చేసుకొన్నాడు సత్తిబాబు. వాళ్ళు అడవి అంతా గాలించి తమను మట్టుబెడతారు. అప్పటివరకు నిద్రాహారాలు కూడా మానేస్తారు. సత్తిబాబులో సన్నగా వణుకు ఆరంభమైంది.

ఎలాగయినా అక్కడ నుండి తప్పించుకోవాలి—ఎలా?

అతడికి వాళ్ళు మాట్లాడుకున్న అన్ని మాటలలోనూ

''దంతేశ్వరీదేవి' అన్న మాట ఒకటే అర్థమైంది.

ముందు తను అక్కడకు చేరుకోవాలి. తర్వాత జరగ బోయేది చూడొచ్చు.

ఆ ఆలోచన రాగానే కనిపించిన దారిగుండా పరుగు మొదలుపెట్టాడు.

అరగంటయినా కాకుండానే అతడికి ఒక మందిరం కనిపించింది.

హుషారుగా అటువయిపు పరిగెట్టాడు సత్తిబాబు.

అక్కడి వాతావరణం చూసి అతడికి మతిపోయింది. మందిరంలో చాలామంది వున్నారు. అందర్నీ మిత్రభాను బెదిరిస్తోంది. ఒక్కనిముషం ఆలుపు తీర్చుకుని మిత్రభాను వెనక్కు చేరుకొన్నాడు.

# 16

మిత్రభాను—జయకర్‌ను బంధించిన పదినిముషాల తరువాత బయటకు వచ్చింది. ఇప్పుడు ఆమె అన్నిటికీ తెగించింది.

బయట బాగా ఎండ మొదలయింది.

మందిరం వెనుక అంతా గజిబిజిగా వుంది. ఆ వైపు వెళ్ళటానికి వీలులేదు. ధైర్యంచేసి గోడను ఆనుకొంగా చేసుకుని మందిరం ముందుకు వచ్చింది.

మందిరంలోంచి రాబర్టు అంకెలు లెక్కపెడుతో న్నాడు.

ఆమెకు జరుగుతోన్నది చూచాయిగా అర్థమవు తోంది.

మిత్రభాను పూర్తిగా మందిరం ముందుకు వచ్చింది. మందిరం బాగా ఎత్తులో వుంది. మందిరం అరుగు తన ఛాతీని దాటి పైకే వుంది. మిత్రభాను ఎవరికీ కనిపించటం

లేదు. అందరూ మందిరంలో జరిగే తతంగాన్ని చోద్యం చూసినట్లు చూస్తోన్నారు. మిత్రభాను మెట్లు యెక్కి మందిరం అరుగును చేరుకుంది.

ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి ఒక్క క్షణం ఊపిరి తీసుకోవటం మర్చిపోయింది.

ఎదురుగా రాబర్టు కత్తిపట్టుకు నిలబడ్డాడు.

వాశిష్టశాస్త్రి మౌనంగా వుండిపోయాడు.

రాబర్టు 'ఓన్' అన్నాడు.

అంతే వెంటనే మిత్రభాను ఎలర్టయిపోయింది. రాబర్టును, కత్తి క్రింద పడెయ్యమని హెచ్చరించింది.

రాబర్టు కత్తి క్రింద పడేశాడు.

"అందరూ చేతులు పైకెత్తండి!" అంది.

అందరూ మౌనంగా ఆమె చెప్పినట్లు చేశారు.

మిత్రభాను జయకర్ వయిపు చూసింది.

అతడు అచేతనంగా స్తంభానికి వ్రేలాడుతోన్నాడు.

తల వెనుక నుండి రక్తం కారుతోంది. ముందు అతడికి మెలకువ రావాలి. అంతవరకూ అందర్నీ అదుపులో వుంచాలి. ఈలోగా మాస్టార్ని అలర్టు చెయ్యాలి అనుకొంది.

వాశిష్టశాస్త్రి ఇంకా కళ్ళు మూసుకొనే వున్నాడు. అతడు పూర్తి మెడిటేషన్‌లో వున్నాడు.

మిత్రభాను నోరు తెరవబోయింది.

ఈలోగా వెనుక చప్పుడయింది.

చటుక్కున వెనక్కి తిరిగింది. అదే ఆమె చేసిన పొరపాటు. అదనుకోసం చూస్తూ వున్న సుందరి, అమాంతం మిత్రభానుమీద పడింది. మిత్రభాను ఖంగు తింది,

ఈలోగా రాబర్టు రంగంలోకి దిగి సత్తిబాబును, జయకర్ ప్రక్కనే మరో స్థంభానికి కట్టేశాడు.

తర్వాత వాశిష్టశాస్త్రి దగ్గరకు వెళ్ళాడు. "ఏయ్! ముసలీ! ఇటు చూడు!" అన్నాడు.

వాశిష్టశాస్త్రి కళ్ళు తెరిచాడు.

ఎదురుగా వున్న మిత్రభానును చూశాడు. "అమ్మా! నువ్వూ వీళ్ళకు దొరికిపోయావా....?" అన్నాడు బాధగా.

మిత్రభాను ఆయనవంక జాలిగా చూసింది. "అంకుల్!" అంది.

వాశిష్టశాస్త్రి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

ఆ దృశ్యం చూసి ఈశ్వరప్రసాద్ బుర్రలో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. అతడు ముందుకు వచ్చి శాస్త్రి వయిపు చూశాడు.

శాస్త్రి అతడిని అసహ్యంగా చూస్తూ, "ఒరేయ్! ఇంత చేసి యేం బావుకుంటావురా?" అన్నాడు.

ఈశ్వరప్రసాద్ తెరలు తెరలుగా నవ్వాడు. "చూడు శాస్త్రీ! స్నేహితుడివన్న ఇదితోద్దీ నేను నీకు హాని తల పెట్టలేదు. ఇక నావల్ల కాదు. మంకుపట్టు మాని ఆ మూలికల విషయం పూర్తిగా మాకు చెప్పెయ్యి. ఆ మూలికలను మేమూ సంపాదించగలము. కానీ నీకు వాటి సంగతి పూర్తిగా తెలుసు. అవి ఏ చెట్టు వేళ్ళో, వాటితో కల్చర్ ఎలా తయారుచెయ్యాలో—ఆ కల్చర్ని యెలా వుపయోగించాలో అన్నీ నీకు తెలుసు. అందుకే నిన్ను ఇంత బ్రతిమాలుతున్నాము" అన్నాడు.

శాస్త్రి మాట్లాడలేదు.

"నిచేత యెలా మాట్లాడించాలో నాకు బాగా

తెలుసు" అంటూ మిత్రభాను దగ్గరకు నడిచాడు.

మిత్రభాను అతడిని భయం భయంగా చూసింది.

అతడు ఆమె చీరను లాగేశాడు.

మిత్రభాను అదిరిపడింది. "అంకుల్!" అంది అతడిని బ్రతిమాలుతూ.

ఈశ్వరప్రసాద్ కరగలేదు. ఆమె జాకెట్‌ను చింపేశాడు.

ఇప్పుడు మిత్రభాను కట్టి బ్రా, పెట్టికోటులతో మాత్రమే వుంది.

ఆమెను దొరకపుచ్చుకుని శాస్త్రివయిపు చూశాడు ఈశ్వరప్రసాద్.

"ఒరేయ్! ఆ పసిపిల్లను యేమీ చెయ్యకురా!" బ్రతిమాలుతున్న ధోరణిలో అడిగాడు శాస్త్రి.

ఈశ్వరప్రసాద్ వికటంగా నవ్వాడు. "ఎందుకు చెప్పు మిండికేస్తావ్? చెప్పెయ్" అన్నాడు.

"దుర్మార్గుడా! ఇంతకు యింతకూ అనుభవిస్తావ్!"

"శాపనార్థాలు తరువాత! ఒరేయి, వాటి గురించి చెబుతావా లేకపోతే దీని జీవితం ముక్కలు చింపిన విస్తరి చేసెయ్యనా?" అని అరచి మిత్రభానువయిపు చూశాడు.

ఈలోగా వెనుక నుండి హెచ్చరిక వినిపించి అవాక్కయిపోయాడు.

## 17

శేఖర్ కళ్ళు తెరచి చూశాడు.

చుట్టూ చాలా మంది స్పృహ తప్పి పడిపోయి వున్నారు.

అతడికి జరిగింది లీలగా గుర్తొచ్చింది.

ఏదో స్మోక్ బాంబులాంటిది మైదానం మధ్య పడింది. ఆ చప్పుడుకి తనను నరకబోతున్న మనిషి ఉలిక్కి పడ్డాడు. మెడమీద పడాల్సిన కత్తి క్రిందకు వాలి పోయింది. అతడు స్పృహతప్పి క్రింద పడిపోయాడు. అతడితో బాటే తనకూ స్పృహ తప్పింది. ఇప్పుడు మెలకువ వచ్చింది.

సత్తిబాబు కోసం, సుందరి కోసం చూశాడు. అక్కడ ఇద్దరూ లేరు. "ఏమయిపోయారు? స్మోక్ బాంబును యెవరు విసిరేరు?" ఇటువంటి సందేహాలు ఒక దాని వెనుక మరొకటి కలిగాయి. "ఆలోచిస్తూ కూర్చుంటే ప్రమాదం ముంచుకురాగలదు. పారిపో!" అని మనసు తొందరపెట్టింది.

శేఖర్ లేచి నిలబడ్డాడు.

జేబుల్లో చేతులు దూనిచాడు.

అదృష్టం.... జేబులో పిస్తోలు అలానే వుంది. కంటికి కనిపించిన తోవగుండా నడవటం ఆరంభించాడు.

రాత్రంతా నిద్ర లేకపోటంవల్ల కళ్ళు మండుతూ న్నాయి. స్మోక్ బాంబు ప్రభావంవల్ల కళ్ళు తూలు తోంది. అయినా అతను వాటిని లక్ష్యపెట్టకుండా ముందుకు సాగిపోతోన్నాడు.

దాదాపు గంట పైచిలుకు నడిచాడు.

దూరంగా యేదో మందిరం కనిపిస్తోంది.

అటువైపు అడుగులు వేశాడు.

పది నిముషాలలో మందిరాన్ని చేరుకొన్నాడు.

మందిరము మీద నుండి మాటలు వినిపిస్తోన్నాయి.

ఎందుకయినా మంచిదని శేఖర్ గోడవారగా

పొక్కుంటూ మందిరం ముందుకు వచ్చాడు.

అక్కడి దృశ్యాన్ని చూసి కొయ్యబారిపోయాడు.

ఎదురుగా తన తండ్రి నిలబడి వున్నాడు.

అతడి యెదురుగా మిత్రభాను చేతులు జోడించి వణుకుతూ నిలబడింది. ఆమె వట్టి అంగా, బ్రాలతో మాత్రమే వుంది.

"నన్నేమీ చెయ్యకండి" ప్రాధేయపడుతోంది మిత్ర భాను.

అరుగుమీద వున్న స్తంభాలకు జయకర్‌ను, సత్తి బాబును కట్టేశారు. వాళ్ళకు కొంచెం దూరంలో, ఇద్దరు ఆటవికులు నిలబడివున్నారు.

శేఖర్ పళ్ళు పటపట కొరికాడు. తను మిత్రభాను మీద మోజుపడ్డాడు. నిజమే, కానీ ఆమెను తన తండ్రే బాధపెడుతోంటే చూడలేకపోయాడు శేఖర్.

అప్పటివరకు మిత్రభానుమీద అతడి కున్న అభి ప్రాయం మారిపోయింది. ఆమెమీద జాలి యేర్పడింది.

అక్కడకు అంతమంది ఎలా వచ్చారో అర్థంకావటం లేదు.

"ఒరేయ్ శాస్త్రీ! వాటి గురించి చెబుతావా? లేక పోతే దీని జీవితం తుక్కులుచింపిన విస్తరి చేసెయ్యనా!" అని అరుస్తోన్నాడు ఈశ్వరప్రసాద్.

శేఖర్ నెమ్మదిగా స్తంభాల దగ్గరకు వెళ్ళాడు.

తను యిప్పుడు అరుగు వార వున్నాడు. చేతులు పైకెత్తాడు. జయకర్ చేతులు తగిలాయి. కట్లు ఊడదీశాడు. తర్వాత నెమ్మదిగా సత్తిబాబు దగ్గరకు వచ్చి అతని కట్లను కూడా ఊడదీశాడు.

శేఖర్‌ను మెచ్చుకోలుగా చూశాడు సత్తిబాబు.

వెంటనే ప్రక్కనున్న ఈశ్వరప్రసాద్ అనుచరులనూ గొంతు పట్టుకు క్రిందకు వంచేశాడు. ఆలోగా శేఖర్ అరుగుమీదకు వచ్చాడు. చేతిలోని పిస్తోలు సుందరికి గురి పెట్టి "మిస్టర్ ఈశ్వరప్రసాద్! మర్యాదగా ఆమెను వదిలి ప్రక్కకు తప్పుకో" అన్నాడు.

ఈశ్వరప్రసాద్ కొడుకు వయిపు ఆశ్చర్యంగా చూశాడు "నాన్నా! నువ్వు యిక్కడకు వచ్చావా?" అన్నాడు ఆందోళనగా.

"ఛ! నన్నలా పిలవకు" అన్నాడు శేఖర్ అసహ్యంగా.

ఈలోగా సత్తిబాబు అనుచరుల భరతం పట్టి అక్కడకు వచ్చి శేఖర్ ప్రక్కన నిలబడ్డాడు. "ఒరేయ్! నాకు ఆ పిస్తోలు యిచ్చి వాళ్ళందర్నీ కట్టేయ్" అన్నాడు.

శేఖర్ అతడికి పిస్తోలు అందించి, రాజునూ, ఈశ్వరప్రసాద్‌నూ, సుందరినీ, యిద్దరు అనుచరులనూ కట్టిపడేశాడు.

"ఒరేయ్, వాడిని నమ్మకురా?" అన్నాడు ఈశ్వరప్రసాద్.

శేఖర్ తండ్రివయిపు అసహ్యంగా చూశాడు.

తరువాత సత్తిబాబువయిపు చూశాడు. అంతే ఒక్కసారి గుండె ఆగినట్లయింది. సత్తిబాబు పిస్తోల్‌ను తనకు గురిపెట్టాడు. "ఒరేయ్, ఏంట్రా యిది?" అన్నాడు.

సత్తిబాబు వికటంగా నవ్వాడు. "ముందు దాన్ని కూడా కట్టెయ్యి!" అన్నాడు మిత్రభాను వయిపు చూపించి.

శేఖర్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి, తండ్రి అలాంటి వాడు, ఆప్తుడని నమ్మిన మిత్రుడు యిలా ప్రవర్తిస్తున్నాడు.

"నిన్నే!" గద్దించాడు సత్తిబాబు.

శేఖర్ అయిష్టంగానే మిత్రభాను వయిపు తిరిగాడు. మిత్రభాను వెంబేలెత్తిపోయింది. ఒక గండం గడిచిందంటే మరోటి దాపురించింది. సత్తిబాబు అలాంటి వాడని ఆమె యేనాడూ ఊహించలేదు. అతడు చాలా సార్లు, వాశిష్టశాస్త్రి దగ్గరకు రాగా తనూ చూసింది.

"సారీ!" అంటూ మిత్రభాను చేతులు కట్టేశాడు శేఖర్.

సత్తిబాబు అందరివంకా వికృతంగా చూశాడు. తర్వాత వాశిష్టశాస్త్రివయిపు తిరిగి "మాస్టారూ! మీరంటే నా కెంతో గౌరవం. ఆ గౌరవాన్ని నిలబెట్టుకుంటారనుకుంటాను" అన్నాడు.

శాస్త్రి మనసు అప్పటికే చిత్రవధ అనుభవించి వుంది. ఆయన తన చుట్టూ తిరిగే సత్తిబాబే తనను ఇలా ఇబ్బంది పెడతాడని ఊహించలేదు. అందుకే నోటమాట రాక మౌనంగా వుండిపోయాడు.

"అయితే నా గదిలో దూరి, మా మాటలన్నీ విన్నది నువ్వేనన్న మాట" అన్నాడు రాబర్టు. అతడి మనసు వుడుకుడుకు లాడిపోతోంది. అతడికి శేఖర్ మీద పీకలమొయ్యా కోపం వచ్చింది. ఆ సమయంలో శేఖర్ గానీ అక్కడకు రాకుండా వుంటే ఈ పాటికి వేళ్ళ రహస్యం తెలిసిపోను.

సత్తిబాబు అదోలా నవ్వేడు. "ఒక్క నీ మాటలే కాదు. శాస్త్రిగారు తన ప్రయాణం సంగతి జయకర్ లో

చెప్పుతున్నప్పుడే నేను వాళ్ళ సంభాషణను పొంచి విని మా బాస్‌కు చెప్పాను" అన్నాడు.

"ఎవరు మీ బాస్, నాగన్నేనా?" అన్నాడు రాబర్టు.

సత్తిబాబు ఒక్కక్షణం తుళ్ళిపడ్డాడు. అయినా భావం పైకి కనపడనీయకుండా "గుడ్! బాగానే ఊహించావు" అన్నాడు.

ఈసారి రాబర్టు పెద్దగా నవ్వాడు. "ఒకేయ్! కుర్రకుంకా, ఆ నాగన్నగాడిని ఈ చేతులతోనే నరికి పారేశాను. నువ్వెంత...." అన్నాడు.

రాబర్టు ఊహించినట్లు సత్తిబాబు కంగారుపడలేదు. "చాలా థాంక్స్! ఎలానూ, ఆ పని నేనే చెయ్యాలనుకున్నాను. నువ్వు చేసిపెట్టావు" అన్నాడు.

రాబర్టు పళ్ళు నూరాడు. "నువ్వు ఎలా తప్పించుకుంటావో చూస్తాను" అన్నాడు.

"ఏడిశావు! ఇప్పుడు మీరంతా నా బందీలు. నేను మహారాజును" అన్నాడు.

కానీ జయకర్‌ను, తనతోపాటే బంధవిముక్తుడిని చేశాడని అతనికి తెలియదు.

అతను అలా అంటూన్నప్పుడే జయకర్‌కు మెలకువ వచ్చింది. ఒక్కక్షణంలో పరిస్థితిని అకళింపు చేసుకొని సత్తిబాబుమీద పడ్డాడు. సత్తిబాబు ఇలా జరుగుతుందని వూహించలేదు—గాభరాపడిపోయాడు.

క్షణాల్లో పరిస్థితి తారుమారయ్యింది.

సత్తిబాబును స్తంభానికి బిగించి కట్టేశారు.

"మనం తొందరగా బయలుదేరాలి. కాసేపట్లో ఆటవికులు అడవి అంతా వెదుకుతూ యిక్కడికి రావచ్చు"

అన్నాడు శేఖర్ ఖంగారుగా.

"మీరు ఎక్కడికీ పోలేరు. వాళ్ళు ఈపాటికి బయలు దేరి వుంటారు" అన్నాడు సత్తిబాబు.

వాళ్ళు అతడి మాటను పట్టించుకోలేదు.

"మాష్టారూ! బయలుదేరండి!...." అన్నాడు జయకర్.

మిత్రభాను బట్టలు వేసుకుంది. మందిరం ప్రక్క నున్న గూటి దగ్గరకు వెళ్ళి కిట్‌ను బయటకు తీసుకు వచ్చింది.

ముందు వాశిష్టశాస్త్రి, తర్వాత జయకర్, శేఖర్, మిత్రభానులు మందిరాన్ని వదలి బయటకు వచ్చారు.

"మనం వెళ్ళి, వీళ్ళ సంగతి పోలీసులకు చెబుదాం. అప్పటివరకూ వీళ్ళు ప్రాణాలతో వుంటే అదృష్ట వంతులు. లేకపోతే చేసిన పాపానికి శిక్ష అనుభవిస్తారు" అన్నాడు శాస్త్రి.

"మీరు యిక్కడే వుండండి!" అని వాశిష్టశాస్త్రి ముందుకు వెళ్ళాడు. అరగంటలో తిరిగివచ్చాడు—తను దాచిన రాశాశి వేళ్ళతో.

అతడు యెక్కడకు వెళ్ళాడో జయకర్ గ్రహించాడు.

## 18

సాయంకాలం ఆరుగంట లయింది.

అడవంతా సందెచీకట్లు అలుముకొంటున్నాయి.

శాస్త్రి బృందం నెమ్మదిగా అడుగులువేస్తూ ముందుకు వెళుతోంది.

"మాష్టారూ! ఇప్పటికి మనం యెంత దూరం వచ్చుంటాం?" అడిగాడు జయకర్.

"మందిరము నుండి ఎనిమిది మైళ్ళ పైచిలుకే వచ్చుంటాం."

"అంకుల్! మనకు ప్రమాదం తప్పినట్లేనా?" అడిగింది మిత్రభాను.

"మనం ఆటవికులను, తక్కువగా అంచనా వెయ్యకూడదు. శేఖర్ చెప్పిందాన్నిబట్టి చూస్తే పరిస్థితి చాలా తీవ్రరూపంలో వుందని చెప్పాలి. ఇప్పుడు ఆటవికులంతా గుంపులుగా మారిపోయి వేట మొదలెడతారు. వాళ్ళది నాగు కంటే భయంకరమయిన పగ" శాస్త్రి అలా చెబుతూండగానే దూరంగా ఎవరో కదుల్తోన్న శబ్దమయింది.

"రండి ప్రక్కకు పోదాం. ఎవరో వస్తోన్నట్లున్నారు" అన్నాడు జయకర్.

శాస్త్రి పెదవి విరిచాడు. "లాభం లేదు. వాళ్ళు మనని చూసేశారు" అన్నాడు.

"అయితే ఇప్పుడేం చెయ్యాలి?" భయంగా అడిగింది మిత్రభాను.

"ఎటాక్" అన్నాడు శాస్త్రి.

అంతే జయకర్, శేఖర్‌లు పిస్తోళ్ళు బయటకు తీశారు.

"జయకర్! ప్రాణహాని జరగనివ్వకండి. ప్రమాదం లేనిచోట కాల్చండి. వీలుంటే బెదిరించండంతే!" అన్నాడు శాస్త్రి.

జయకర్ తల ఊపాడు.

అప్పటికే శేఖర్ తన తుపాకీకి పని చెప్పాడు.

అంతే! దూరంగా ఆటవికులు పరుగెత్తుతోన్న శబ్దం—

"పారిపోతోన్నారు........" అన్నాడు శేఖర్ హుషారుగా!

"అమ్మయ్య" అంది మిత్రభాను.

శాస్త్రి మొహంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది. "వాళ్ళని అనవసరంగా రెచ్చగొట్టానేమో!" అన్నాడు.

"పారిపోయారుగా మాస్టారూ!...." అన్నాడు శేఖర్.

"కాదు! వాళ్ళు తక్కువనుంది వుండివుంటారు. మన దగ్గరున్న మారణాయుధాల్ని చూసి, తమవాళ్ళను పిలుచుకురావటానికి వెళ్ళుంటారు. మనం వెళ్ళేలోయే దారిలో కాపు కాస్తారు" అన్నాడు శాస్త్రి.

"ఇప్పుడెలా?...." అడిగాడు జయకర్ కంగారుగా.

"మన ప్రాణాలు పోక తప్పవు. కానీ నా దగ్గర వున్న రాకాసి వేళ్ళను సురక్షితంగా మన యూనివర్సిటీకి చేర్చలేకపోతున్నాననే, నా బాధ" అన్నాడు శాస్త్రి.

అంతలో శేఖర్ మాస్టారి ముందుకు వచ్చాడు "సార్! నేను అటవికుల దృష్టిని మళ్ళిస్తాను. మీరు త్వరగా వెళ్ళిపోండి! అడవి చివర వున్న సంబరాల కోలనుకు కొంచెం అవతలగా నా జీప్ వుంది. దానిమీద మీరు వెళ్ళిపోండి" అన్నాడు.

శాస్త్రి అతనిని ఆప్యాయంగా చూశాడు. "వద్దు నాయనా! అది చాలా ప్రమాదకరమయిన పని. ఇంత చేసినా మేము సురక్షితంగా వుంటామని నమ్మకం లేదు. చస్తే నల్గురూ కలిసే చద్దాం! పారిపోతే నల్గురూ కలిసి

పారిపోతాం!" అన్నాడు.

మిగిలిన యిద్దరూ ఆయన వాదనకే బలపరిచారు.

శేఖర్ ఇక మాట్లాడలేకపోయాడు.

మళ్ళీ నల్గురూ కలసి ముందుకు సాగిపోయారు.

రాత్రి పదవుతోందనగా సంబరాల కోలనును చేరు కొన్నారు. అప్పటివరకూ వారి ప్రయాణానికి ఏ రకమైన అవరోధమూ ఏర్పడలేదు. త్రోవలో ఆటవికులు ఎవరూ తారసపడలేదు.

ఇంకో మైలుదూరం వెళితే ప్రమాదం తప్పిపోయి నట్లే.

అప్పుడే అనుకోని సంఘటన జరిగిపోయింది—

నడుస్తూన్న వాడల్లా శాస్త్రి ఒక్కసారి ఆగి పోయాడు—

సంబరాల కోలను వయిపు చూశాడు.

పౌర్ణమి వెళ్ళి నాలుగు రోజులయినా వెన్నెల తగ్గ లేదు. ఆ వెలుగులో శాస్త్రి కోలను వయిపు చూపించాడు.

కోలనులో నీరు అలలు అలలుగా కదులుతోంది.

"ఏమిటి అంకుల్" అంది మిత్రభాను.

"వాళ్ళు కోలనులో వున్నారు. మనం ముందుకు వెళితే వాళ్ళకు దొరికిపోతాం. ఒక్క కోలనులోనే కాదు. ఈ చుట్టుప్రక్కల కూడా వాళ్ళు కాపుకాచి వుంటారు" అన్నాడు శాస్త్రి.

"మరి ఇప్పుడెలా?" అడిగారు మిగిలిన ముగ్గురూ ఒక్కసారిగా.

"ఈ త్రోవకు అటువయిపున చిన్న సెలయేరులాంటి ప్రవాహం వుంది. మనం దానిలోంచి నడిచి దాదాపు అరమైలు వెళితే, మళ్ళీ త్రోవ వస్తుంది. సాకు అదొ

క్కుటే మార్గంలా కనిపిస్తోంది" అన్నాడు శాస్త్రి.

"మరింకేం మాస్టారూ! పదండి అటు పోదాం" అన్నాడు శేఖర్.

శాస్త్రి నిర్లిప్తంగా నవ్వాడు. "అది అంత సులువు కాదు. దాంట్లో మొసళ్ళు వుంటాయి. వాటిని తప్పించు కుని ముందుకు వెళ్ళటం కష్టం" అన్నాడు.

"పర్వాలేదు సార్. వాటికంటే వీళ్ళే భయంకరులు సార్. ముందు నడవండి" అన్నాడు శేఖర్.

"అందరూ క్రింద కూర్చోండి. నెమ్మదిగా దేక్కుంటూ అక్కడకు వెళదాం" అన్నాడు శాస్త్రి. అలా అంటూన్నప్పుడు వాళ్ళ తలలమీద నుండి కస్సున శబ్దం చేస్తూ కొన్ని బరిసెలు వెళ్ళిపోయాయి.

పావుగంట తర్వాత సెలయేరును వారు చేరుకొన్నారు.

ముందు శాస్త్రి నీటిలో దిగాడు. నీరు మోకాలు కూడా దాటదు. తర్వాత మిగిలిన ముగ్గురూ దిగారు. అందరి చేతుల్లోనూ పదునయిన కత్తులున్నాయి.

నీరు చల్లగా వుంది.

నీటిలోంచి నడిచేటప్పుడు చప్పుడు రాకుండా జాగ్రత్తగా నడుస్తోన్నారు.

దాదాపుగా ఆ ప్రవాహాన్ని దాటేసినట్లే.

అంతలోనే శేఖర్ ఒక్కసారి ఆగాడు.

అతడికి చిన్న మత్తులాంటిది ఆవరించింది. ఇక ముందుకు నడవలేక నీటిలో 'దబ్'మని పడిపోయాడు.

"ఏం జరిగింది?" అని శాస్త్రి అటువైపు చూశాడు.

అప్పుడు గమనించారు ముగ్గురూ.

శేఖర్ ఎడమకాలు చాలా భాగం తెల్లగా మెరు

స్తోంది.

జరిగింది గ్రహించాడు శాస్త్రి.

"మైగాడ్... త్వరగా రండి!" అంటూ శేఖర్‌ను పైకి లేవదీయమన్నాడు.

జయకర్ అతడిని లేపి భుజంమీద వేసుకొన్నాడు.

ముగ్గురూ పరుగులాంటి నడకతో జీపును చేరుకొన్నారు. కొమ్మలను తప్పించి, జయకర్ డ్రైవింగ్ సీటులో కూర్చున్నాడు—నెమ్మదిగా ఇంజన్ స్టార్టు చేశాడు. శాస్త్రి మిత్రభాను వెనుక కూర్చున్నారు.

శేఖర్‌ను నెమ్మదిగా పడుకోబెట్టారు.

జయకర్ జీపును ముందుకు వురికించాడు.

అప్పుడు మొదలయింది వెనుకనుంచి దాడి.

బాణాలు, బరిసెలు వచ్చి జీవు వెనుక భాగానికి తగులుతోన్నాయి.

అయిదునిముషాలలో జీపు వాళ్ళ దాడినుండి తప్పించుకొని ముందుకు పోయింది.

మిత్రభాను కిట్‌లోంచి సిరంజితీసి శేఖర్‌కు ఇంజక్టు చేసింది. తర్వాత కాలుకు బేండేజి కట్టింది.

"మైగాడ్! మొసలి అలా మాంసాన్ని తినేసినా డెలా వూరుకొన్నాడో" అంది ఆశ్చర్యంగా.

•   •   •

శేఖర్ కళ్ళు తెరిచాడు.

సంద కిరణాలు అతడి మొహంమీదపడి ప్రతిఫలిస్తోన్నాయి.

శేఖర్ చుట్టూ చూశాడు తను హాస్పిటల్‌లో ఉన్నట్లు గ్రహించాడు. అతడికి జరిగింది లీలగా గుర్తొచ్చింది. నీటిలో సొమ్మసిల్లి పడిపోవటందాకానే అతడికి

తెలుసు.

తర్వాత జరిగింది మిత్రభాను చెప్పింది.

"తెల్లవారుజాము నాలుగుగంటలకు మనం ఇక్కడకు వచ్చాము వెంటనే నిన్ను హాస్పిటల్‌లో అడ్మిట్ చేశాము. కానీ సారీ! నీ కాలు తీసేయాల్సి వచ్చింది" అంది మిత్ర భాను. అలా చెబుతోన్నప్పుడు ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

ఆ నీరు చూసి శేఖర్ చలించిపోయాడు. అతడు జీవితంలో నిజమైన అభిమానాన్ని మొదటిసారిగా రుచి చూస్తోన్నాడు. "పోనీ భానూ! కాలుపోతే పోయింది. మీ అందరి అభిమానం దక్కింది. అయినా నేను గతంలో చేసిన తప్పులకు ఇది శిక్ష" అన్నాడు శేఖర్.

అంతలో జయకర్ అక్కడకు వచ్చాడు. "గుడ్ మార్నింగ్! మెలుకువ వచ్చిందన్నమాట. ఎలా వుందిప్పుడు" అన్నాడు ఆప్యాయంగా.

"బాగానే వుంది!"

"గుడ్ న్యూస్! మనను వైస్ ఛాన్సలర్ గారు ప్రత్యే కంగా అభిమానించటానికి వస్తోన్నారు. తర్వాత శేఖర్ పూర్తిగా కోలుకున్నాక, మాస్టారుతోబాటు మన ముగ్గురికీ కూడా సన్మానం చేస్తారుట" అన్నాడు హుషా రుగా.

"మాస్టారు ఏరీ?" అన్నాడు శేఖర్.

"ఎక్కడ! ఆయన డిపార్టుమెంటునుండి బయటకు రావటానికే లేదు. ఒకటే జనప్రవాహం" అన్నాడు జయకర్.

అంతలోనే శాస్త్రి లోపలకు వచ్చాడు. శేఖర్‌ను పలకరించాడు. "ఒక బాడ్ న్యూస్! పోలీసులు దంతే

కాళీదేవి మందిరానికి చేరుకొనేసరికి సత్తిబాబును మిగిలిన వాళ్ళనూ, ఆటవికులు నరికేశారట. పోలీసులకు మొండాలూ, తలలూ విడివిడిగా దర్శనమిచ్చాయట. శవాలను అర్ధరాత్రిలోగా తీసుకువస్తారట" చెప్పాడు శాస్త్రి.

వారిని అభినందించటానికి యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ లోపలకు వచ్చాడు.

అప్పుడే ఆవరించుకొన్న చీకట్లను పారదోలటానికి మేఘాలమధ్యనుండి బయటకు వచ్చాడు జాబిల్లి.

—: ఐ పో యిం ది :—

# బకాసుర వధ!

## ఎ.యస్. రావ్

"ఏం చేద్దాం, నాన్నా?"

మెల్లగా మెట్లుదిగి, అడుగులేస్తున్న సదానందమూర్తి ఆగి, తన పదిహేనేళ్ళ కూతురు సువర్చలవైపు నిస్సహాయంగా చూశాడు. సువర్చల మొహంలో ఆదుర్దా, నిరాశ స్పష్టంగా అవుపిస్తున్నాయి. సదానందమూర్తి అప్రయత్నంగా నిట్టూర్చాడు. ఆదుర్దాగా, అమాయకంగా తనని ప్రశ్నిస్తున్న కూతురికి తను ఏం చెప్పాలి? ఏమీ చేయలేనని చెప్పాలా?.

బిల్డింగ్ ముందు సాగుతున్న కలకలం అతన్ని ఈ లోకంలోకి లాక్కొచ్చింది. అతను అలాగే నిలబడి చుట్టూ చూశాడు. ఎంతోమంది యువకులు, యువతులు, ఎంతోమంది తండ్రులు; సంరక్షకులు....అడ్మిషన్లు ప్రారంభమైన ఈ రోజు కాలేజీ ఆవరణ సంతలా తయారైంది. ఇంతమందిలో, ఎంతోమందిలో కొంత మందే సెలక్టవుతారు. ఎందుకంటే కొంతమందే అవసర

మైనవన్నీ, లేకపోతే అడిగినవన్నీ అందజేసి సీట్లు సంపాయించుకోగలరు!

మళ్ళా నిట్టూర్చి, సదానందమూర్తి కదిలాడు. అతన్నే చూస్తూ సువర్చల అతన్ని అనుసరించింది.

"సువర్చలా.... చేరిపోయావా?"

సువర్చలా, సదానందమూర్తీ దగ్గరగా ప్రశ్నించిన అమ్మాయివేపు చూశారు. ఖరీదైన దుస్తులు, పెళ్ళికివచ్చిన దానిలా తయారైన దేవిక సువర్చలని నవ్వుతూ చూస్తోంది,

"ఇంకా లేదు...." సువర్చల మెల్లిగా అంటూ నవ్వే ప్రయత్నం చేసింది.

"దేవికా, కమాన్!" వరండాలోంచీ ఎవరో పిలిచారు. సువర్చలవైపు అడుగులు వేయబోయిన దేవిక పక్కకి తిరిగి వరండావైపు జోరుగా నడిచింది.

"నాన్నా... మానేద్దామా....?"

సదానందమూర్తి తలతిప్పి, పక్కనే నడుస్తున్న కూతుర్ని జాలిగా చూశాడు. తన కూతురికి చదువుకోడమంటే చాలా ఇష్టం. ఇంతవరకూ తను 'పుస్తకాలుతీసి చదువుకో' అని ఆమెని హెచ్చరించలేదు. ప్రైవేట్ ట్యూషన్లకి పంపలేదు. అయినా సువర్చల చక్కగా చదువుకుంది; పాసయ్యింది. అయినా చదువుకోడానికి ఇంటరెస్టు ఒక్కటే చాలదు!

"....చూద్దాం రా, తల్లీ...." 'మానేద్దాం' అనబోయిన సదానందమూర్తి ప్రయత్నించి, అన్నాడు.

"నమస్కారం. మూర్తి గారూ!"

కాంపౌండు గేటు దగ్గర ఆగి సదానందమూర్తి తనవేపు నవ్వుతున్న కైలాసరావుని చిరునవ్వుతో చూశాడు.

అప్రయత్నంగా అతని చేతులు నమస్కారం చేశాయి.

"ఏమిటి? అమ్మాయిని అప్పుడే అడ్మిట్ చేసేశారా?" కైలాసరావు సదానందమూర్తితో అంటూ, అతని పక్కనే నిలబడ్డ సువర్చలవైపు నవ్వుతూ చూశాడు. "ఏ గ్రూపు తీసుకున్నావమ్మాయ్?"

"బైపీసీ దానికి ఇష్టం....అయితే...." సదానంద మూర్తి అనుమానిస్తూ ఆగాడు.

"ఏం? పర్సెంటేజీ చాలలేదా?"

"పర్సెంటేజీ అలావుంచండి....బిల్డింగ్ ఫండట.... చాలా అడుగుతున్నారు...."

"ష్యూర్....బిల్డింగ్ ఫండ్....యస్.....డొనేషన్‌లా వున్నాయా కొంపదీసి?" కైలాసరావు నవ్వుతూ అడిగాడు.

"ఇస్తే....వుంటాయిలెండి! ఆరేళ్ళగా సాగాలేకుండా ఆరుమందికోసం బిల్డింగ్ ఫండ్ ఇస్తూనేవచ్చాను. బిల్డింగేమో అలాగే వుంది. ఈసారి ప్రిన్సిపాల్ ససేమిరా ఒప్పుకోవట్లేదు. మనకేమో శక్తిలేదాయె...." సదానందమూర్తి నీరసంగా అన్నాడు.

"తప్పదుగా! పదండి. మావాడు ఎనిమిదింటికే వచ్చేశాడు. అదుగో వరండాలోంచీ వస్తున్నాడు....వస్తా" కైలాసరావు అదరాబాదరా వెళ్ళిపోయాడు.

సదానందమూర్తి గేటుదాటేడు. సువర్చల అతని వెనకే నీరసంగా అడుగులేస్తూంది. "ప్రిన్సిపాల్ గారు రెండొందలకి వొప్పుకుని వుంటే బాగుండేది...."

సదానందమూర్తి చిన్నగా నవ్వాడు. "పదివందలు అడిగే వ్యక్తి రెండువందలకి ఎలా దిగుతాడు? ఊ.... ఇంటికెళ్ళి అమ్మతో ఆలోచిద్దాం...."

సువర్చల మౌనంగా తండ్రిని అనుసరించింది.

"మూర్తిగారూ...."

సదానందమూర్తి ఆగి, వెనక్కి తిరిగాడు. దగ్గరగా నించున్న అపరిచిత వ్యక్తిని ప్రశ్నార్థకంగా చూశాడు.

మైనూర్ సిల్క్ పైజామా, మైసూర్ సిల్క్ జుబ్బా. పొడుగాటి బలిష్టమైన ఆకారం. వంకీల జుట్టు, పొడుగాటి ముక్కు. చుక్కల్లా మెరుస్తున్న కళ్ళు. సన్నటి మీసాలు. అతని భుజానికి గుడ్డసంచీ వేళ్లాడుతోంది. తనవేపు అర్థంకానట్టు చూస్తున్న సదానందమూర్తినీ, సువర్చలనీ అతను చిరునవ్వుతో చూస్తున్నాడు.

"ఎవరు?" సదానందమూర్తి ప్రశ్నించాడు."మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదు...."

"ఇప్పుడు చూస్తున్నారుగా! చాలు!" అతను నవ్వుతూ అన్నాడు. "బిల్డింగ్ ఫండ్ చెల్లించే శక్తి లేక అమ్మాయిని కాలేజీలో చేర్పించకుండా వెళ్ళిపోతున్నారు...."

"మీకెలా తెలుసు?" సదానందమూర్తి ఆశ్చర్యంతో అడుతగిలాడు.

"మీరూ మీ అమ్మాయీ, మీరూ మీ మిత్రుడూ మాట్లాడిందంతా మీ వెనుక మాత్రమే వినిపించలేదు!" అతను నవ్వుతూ అన్నాడు.

సదానందమూర్తి అయోమయంగా చూశాడు. "ఇంతకీ మీ రెవరు?"

"అయామ్ విద్యాసాగర్."

"నన్నెందుకు పలకరించారు? మీకేం కావాలి?"

విద్యాసాగర్ చిన్నగా నవ్వాడు. "నాకు కావాల్సింది యేమీలేదు. మీకు కావాలి; మీ అమ్మాయికి

కాలేజీలో సీటు!"

"కావచ్చు. అదంతా మీకెందుకు?" సదానందమూర్తి కంఠంలో చిరాకు లీలగా ధ్వనించింది.

"మీ అశక్తతను దండోరా వేయడానికి కాదు! మూర్తిగారూ. ఆ చెట్టుకిందికి వెళ్దాం .......అంతా చెప్తాను..." అంటూ విద్యాసాగర్ రోడ్డుకి అటువేపున్న చెట్టువేపు అడుగులు వేయసాగేడు.

"నాన్నా.... వెళ్దామా...." విద్యాసాగర్ మాటలకి ఆశ్చర్యంలో మునిగిన సువర్చల సందేహిస్తూ తండ్రిని అడిగింది.

"ముక్కూ మొహం తెలీనివాళ్ళతో దేనికి? రా తల్లీ వెళ్దాం...." సదానందమూర్తి నిర్లక్ష్యంగా అన్నాడు.

"అదికాదు నాన్నా...."

విద్యాసాగర్ గిరుక్కున వెనక్కి తిరిగాడు. నాలుగంగల్లో వాళ్ళిద్దర్నీ సమీపించాడు. అతని కళ్ళు తీక్షణంగా సదానందమూర్తి మొహంలోకి చూశాయి.

"మూర్తిగారూ, నేను మీలాంటి మనిషిని; సభ్య మానవుణ్ని. మీ దేశంవాణ్ని. పైగా మీ రాష్ట్రంవాణ్ని! ముక్కూ మొహం తెలీదంటారేం?"

సదానందమూర్తి కళ్ళు చిట్లించాడు. "కావచ్చు మీ పేరు కూడా నాకు యిప్పుడు తెలిసివుండొచ్చు. అయినా మీరు అపరిచితులే!"

"అయితే రండి! ఆ పచ్చని చెట్టుకింద పరిచయం పెంచుకోండి!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు. తన వేపు చూసి నవ్వుతున్న సువర్చల కళ్ళల్లోకి కళ్ళతో నవ్వాడు.

సువర్చల చెయ్యి సదానందమూర్తి ముంజేతిని పట్టు

ఉంది. "ప్లీజ్.... నాన్నా...." అంటూ విద్యాసాగర్ వస్తున్న వైపు కదిలింది.

* * *

"చెప్పండి...." చెట్టుకింద నిలబడ్డ సదానందమూర్తి అన్నాడు.

చెట్టు బోదెకి వీపు ఆన్చి, వాలుగా నించున్న విద్యాసాగర్ అతన్ని తదేకంగా చూశాడు. "మూర్తిగారూ, సువర్చల కోసం—వి మీన్—సువర్చల సీటు కోసం, బిల్డింగ్ ఫండ్ నేను చెల్లిస్తాను...."

"థాంక్స్! తమకు ఆ శ్రమ అక్కర్లేదు!" సదానందమూర్తి చురుగ్గా అన్నాడు.

సువర్చల యిద్దర్నీ అయోమయంగా చూస్తోంది.

"మూర్తిగరూ...."

"మిస్టర్ విద్యాసాగర్, అయాం సారీ! నా కూతురి ఫీజు చెల్లించలేకపోతే, నేను దాని చదువు మానిపించేస్తాను. కానీ, అడుక్కుతినను!"

విద్యాసాగర్ చెట్టు బోదెనుంచీ దూరంగా జరిగి, సదానందమూర్తి దగ్గరగా నిటారుగా నించున్నాడు. అతని మొహంలోకి తీక్షణంగా చూశాడు. "మూర్తిగారూ, మీరు నన్ను అడుక్కున్నారా?"

"లేదు...."

"అయితే ఎందుకలా అన్నారు?"

"అడక్కపోయినా, ఇతర్లు ఇచ్చేది పుచ్చుకుంటే అడుక్కుతిన్నట్లే లెక్క!"

విద్యాసాగర్ అతని మొహంలోకి నవ్వుతూ చూశాడు. "మీ లెక్క పూర్తిగా తప్పు! జీవితమంతా

తప్పుడు లెక్కలు వేసుకుంటూ వచ్చారు గనుకనే ఇవాళ మీ ఏడో సంతానమైన సువర్చల కోసం బిల్డింగ్ ఫండ చెల్లించలేకుండా వున్నారు!"

సదానందమూర్తి ముఖం కొద్దిగా ఎర్రబడింది. "వాట్ డూ యూ మీన్?"

"మాటవరసకి, ప్రభుత్వం మీ కూతురి తరఫున బిల్డింగ్ ఫండ్‌కి వెయ్యి రూపాయలు చెల్లిస్తానంటుందనుకోండి. అప్పుడూ యిలాగే మీరు 'నో థాంక్స్!' అంటారా?"

"ప్రభుత్వం అలాంటి పని చేయాలే గానీ, ఎందుకు వద్దంటాను?" సదానందమూర్తి వెంటనే అన్నాడు. "అసలు ఆ ఫండునే ప్రభుత్వం రద్దు చేయొచ్చుగా?"

"అదలా వుంచండి. ప్రభుత్వం చెల్లిస్తానంటే మీరు వద్దనరు. ఎందుకో చెప్పగలరా?" విద్యాసాగర్ ప్రశ్నించాడు.

"అది ప్రభుత్వ ధనం గనక!"

"ప్రభుత్వ ధనం అంటే, నిజంగా ఎవరిది?" విద్యాసాగర్ నవ్వుతూ ప్రశ్నించాడు.

"....ప్రజలది...." సదానందమూర్తి మెల్లిగా అన్నాడు.

విద్యాసాగర్ చిన్నగా నవ్వాడు. "యూ ఆర్ కరెక్ట్. ప్రజల ధనాన్ని ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వం యిస్తే 'వద్దు' అనని మీరు ఎవడో విద్యాసాగర్ — ప్రజల్లో ఒకడు — యిస్తానంటే యెందుకు వద్దంటున్నారు?"

సదానందమూర్తి కళ్ళద్దాల గుండా ఆశ్చర్యంగా, అయోమయంగా చూశాడు.

"మీ లెక్క తప్పని ఇప్పుడు ఒప్పుకుంటారా?" విద్యా

సాగర్ నవ్వుతూ అడిగాడు.

"అది....అది....వేరే సంగతి...."

"మూర్తిగారూ, భేషజానికి పోకండి. నన్ను తోడ్పడ నివ్వండి...."

"మా అమ్మాయికోసం డబ్బు చెల్లిస్తే మీ కేమిటి లాభం?" సదానందమూర్తి ప్రశ్నించాడు.

"మీ అమ్మాయికోసం మీరు దుకాణంలో నోట్ బుక్సు కొంటున్నారు. అదే సమయానికి లెక్కల నోట్ బుక్ కొనబోతున్న ఒక కుర్రాడు పావలా తక్కువ ఇచ్చాడు. కొట్టతను పుస్తకం లాక్కొని కుర్రాడి చిల్లర కుర్రాడికి పారేశాడు. పావలా లేదన్నాడు కుర్రాడు దీనంగా. మీరు జుబ్బా జేబులోంచి పావలా తీసి కుర్రాడికిచ్చి, పుస్తకం కొనుక్కొమ్మంటారు. ఆ కుర్రాడికి పావలా ఇవ్వడంవల్ల మీ కేమిటి లాభం?"

ప్రశ్నించి, నవ్వుతున్న విద్యాసాగర్ ముఖంలోకి సదానందమూర్తి క్షణకాలం తదేకంగా చూశాడు. సువర్చల కాటుక కళ్ళు రెప్పపాటు లేకుండా విద్యాసాగర్ నే చూస్తున్నాయి.

సదానందమూర్తి మొహంమీద మెల్లిగా చిరునవ్వు ప్రత్యక్షమైంది. "ఆల్ రైట్, మిస్టర్ విద్యాసాగర్, మీ భావం నాకు బోధపడింది....మీరు చెల్లించే డబ్బు నేను యెప్పుడు తిరిగివ్వాలి?"

"నేను యిస్తోంది అప్పుకాదు; విరాళం!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు. "చదువుకోవాలని తహతహలాడుతున్న సువర్చలకి చేతనయినంత చేయూత ఇస్తున్నా; అంతే!"

"అయినా నేను మీ ఋణం తీర్చుకోవాలి. లేకపోతే

నాకు తృప్తిగా వుండదు!" సదానందమూర్తి ఉద్రేకంతో అన్నాడు.

"యస్, అంకుల్! మేం మీ ఋణం తీర్చుకోవాలి!" సువర్చల మెరిసే కళ్ళతో అంది.

విద్యాసాగర్ ఆమె కళ్ళల్లోకి నవ్వుతూ చూశాడు. "ఓ.కే.... నా ఋణం తీర్చుకోవాలంటే మీ రిద్దరూ కలిసి ఒక పని చేయాలి...."

"చెప్పండి! యేమిటి?" సువర్చల ఉత్సాహంగా అడిగింది.

విద్యాసాగర్ తన చూపుల్ని సదానందమూర్తి వైపు మళ్ళించాడు. "మూర్తిగారూ, బిల్డింగ్ ఫండ్ చెల్లించే శక్తిలేని విద్యార్థినీ విద్యార్థుల్ని మరో ముప్ఫైమందిని నా దగ్గరకు తీసుకురండి!"

"వాట్?...." సదానందమూర్తి నమ్మలేనట్లు అరిచాడు.

"అంకుల్....రియల్లీ?" సువర్చల కీచుగా అంది.

"విద్యార్థులు చెల్లించే ఫండ్‌తో అభివృద్ధి చెందుతున్న ఆ కాలేజీ బిల్డింగ్ మీద ఒట్టు!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు. "మిస్టర్ విద్యాసాగర్....అంత మందికీ....అంతమందికీ బిల్డింగ్ ఫండ్ చెల్లిస్తారా?" సదానందమూర్తి ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"అఫ్‌కోర్స్."

సదానందమూర్తి విద్యాసాగర్‌కి మరికొంచెం దగ్గరగా జరిగాడు. అతని మొహంలోకి ఆవేశంతో చూశాడు. "ఇప్పుడు చెప్పండి: మిస్టర్ విద్యాసాగర్, మీ రెవరు?"

విద్యాసాగర్ చిన్నగా నవ్వాడు.

"చెప్పండి! మీరెవరు? మీ పూర్వీకులు జమీం దార్లా?" సదానందమూర్తి మళ్ళీ అడిగాడు.

విద్యాసాగర్ పకపకా నవ్వాడు. "మిస్టర్ మూర్తీ, ఏడేడు పధ్నాలుగు తరాలదాకా నా పూర్వీకు లెవరికీ జానెడు జమీను కూడా లేదు! నేను మామూలు, నేల బారు మనిషిని!"

"అయితే....ఇంతమందికీ....అంత పైకం...."

విద్యాసాగర్ రెండు చేతుల్నీ తన ఛాతీమీద మడత పెట్టుకున్నాడు.

"ఈ మధ్యే ఆవిర్భవించిన 'విద్యార్థి సంక్షేమ సమాఖ్య'కు నేను ప్రెసిడెంటుని; కార్యదర్శిని, కోశాధి కారిని!"

సదానందమూర్తి అర్థమైనట్లు బుర్ర ఆడించాడు. "విద్యార్థులకి సంబంధించి ఏవేవో సంఘా ఉన్నట్టు తెలుసు. అయితే ఈ సంక్షేమ సమాఖ్య గురించి విన లేదు....కార్యస్థానం ఎక్కడుంది?"

"సంక్షేమానికి అర్హులైన విద్యార్థులు ఎక్కడుంటే అక్కడే నా కార్యస్థానం వుంటుంది!"

"ఓకే....విద్యాసాగర్ గారూ....మీతో యెంతో చర్చించాలని వుంది. అదంతా తరవాత చూద్దాం.... అమ్మాయీ నేనూ వెళ్ళి స్టూడెంట్స్‌ని తీసుకొస్తాం... అన్నట్టు....ఎలాంటివాళ్ళని సెలెక్ట్ చేయాలి....జాతి, మతం...."

"మన జాతి అయితే చాలు!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు.

"మన జాతి....అంటే మేం " సదానందమూర్తి సందేహిస్తూ ఆగి, ప్రశ్నార్థకంగా చూశాడు.

"మిస్టర్ మూర్తీ, మీ జాతి, మీ మతం యేమిటో నాకు తెలీదు. నాది యేమిటో మీకు తెలియాల్సిన అవసరం లేదు. మన జాతికి—అంటే—మానవజాతికి చెందిన బీద విద్యార్థినీ విద్యార్థుల్ని జాగ్రత్తగా సెలెక్ట్ చేయండి ..."

"నాకు, అలాంటి పూర్ స్టూడెంట్స్ చాలామంది తెలుసు!" సువర్చల హుషారుగా అంది.

"గుడ్!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు. "గో అండ్ హెల్ప్ యువర్ ఫాదర్! మూర్తిగారూ, స్టూడెంట్స్‌నీ, వాళ్ళ పేరెంట్స్‌నీ—ఎంతమంది అయినా ఫర్వాలేదు— గంటలోగా మీ ఇంటికి తీసుకురండి. నేను అక్కడ మిమ్మల్ని కల్సుకుంటాను."

సదానందమూర్తి అతన్ని సందేహిస్తూ చూశాడు. "మా యిల్లు.... మీకు.... తెలీదు ...."

"తెలుసుకొన్నాను! వెళ్ళిరండి."

## 2

స్వింగ్ డోర్స్ తోసుకుని విద్యాసాగర్ గదిలోకి జొరబడ్డాడు. గోడవారగా వున్న టేబుల్ వెనక తిరుగుడు కుర్చీలో కూచున్న వ్యక్తి, ప్రిన్సిపాల్ అతనివైపు చూడలేదు. తన ముందు కూచున్న వ్యక్తి చెప్తున్నదాన్ని వింటున్నాడు.

"....అంచేత—మీరు దయ చూపించాలి. వెయ్యి రూపాయలు కట్టే స్థితిలో లేను. మూడు వందలు...."

"లాభంలేదు! అయిదువందల రూపాయల సీటులూ వాపసు వెళ్ళిపోయాయి. మీరొకటి అర్థం చేసుకోవాలి. మీ లాంటి పేరెంట్స్ యిచ్చేదంతా ఇటుకలూ, సిమెంటూగా మారి చక్కటి బిల్డింగ్ తయారవుతుంది.

ఈనాడు మనం నిర్మించే భవనం రేపు—ముందు తరాల వాళ్ళకి పనికొస్తుంది. మీ పిల్లలే చక్కగా, రెండు పూటలా చదువుకుంటారు. తగినంత అకామిడేషన్ లేకపోతే, విద్యార్థుల సంఖ్య పెరుగుతూపోతే ఒంటిపూట క్లాసులు నడపడం తప్పనిసరవుతుంది. ఉదయం కాలేజీకి వచ్చినవాళ్ళు మధ్యాహ్నం నుండీ రోడ్లమ్మట బలాదూరు తిరుగుతారు. సింగిల్ సెషన్ మూలంగా మీ పిల్లలు పాడైపోతారని మీరే తరువాత బాధపడతారు. అంచేత ...."

"మీరు చెప్పేదంతా నిజమే; కాదను, కానీ శక్తి వుండాలిగా? దయచేసి ...."

"ఆల్ రైట్ మీ శక్తికొద్దీ ఇవ్వండి. నా శక్తికొద్దీ ఆర్ట్సులో సీటు ఇస్తాను!" ప్రిన్సిపాల్ పీతాంబరం నిర్లక్ష్యంగా అన్నాడు.

"ఆర్ట్స్... ....మా వానికి బైపీసీ కావాలి........ ఎలాగో ...."

"మీ మాటేగానీ, నా మాట అర్థం చేసుకోరేం? అందరికీ బైపీసీ, ఎమ్పీసీ— ఇవే కావాలి? ఆర్ట్స్ కేమిటండీ? డిమాండ్ బాగా వున్నవే అందరికీ కావాలి! కానీ మీ ఊళ్ళో, మీ కొడుకులకీ, మనవళ్ళకీ, ముని మనవళ్ళకీ ఉపయోగపడే కాలేజీ భవనం కట్టడానికి పైసా ఇవ్వరు!"

విద్యాసాగర్ స్వింగ్ డోర్‌ని లోపలికి లాగి, వరండాలోకి తొంగిచూసి, తల ఆడించాడు. తలుపుని వదిలేసి కొంచెం దూరంగా జరిగాడు. క్షణంలో చాలామంది స్టూడెంట్స్ రామదండులా లోపలికి జొరబడ్డారు.

చప్పుడు ప్రిన్సిపాల్ పీతాంబరం దృష్టిని లాగింది.

అతను చిరాకుగా కుర్రాళ్ళనీ, అమ్మాయిల్నీ చూశాడు.

"వాటీజ్ దిస్? వరండాలో కెళ్ళండి. ఒక్కొక్కరే రండి! గో ఔట్!"

విద్యాసాగర్ టేబుల్ దగ్గరగా నడిచాడు. ప్రిన్సిపాల్ మొహంలోకి నవ్వుతూ చూశాడు.

"ప్రిన్సిపాల్ గారూ, వాళ్ళందరినీ నేనే తీసుకొచ్చాను...."

"ఎవరు మీరు?" ప్రిన్సిపాల్ కళ్ళద్దాలగుండా విసుగ్గా చూశాడు.

"నా పేరు విద్యాసాగర్."

"మీకు ఏం కావాలి?"

"ఈ నలభైనలుగురు స్టూడెంట్స్కి అడ్మిషన్ కోరారు. బిల్డింగ్ ఫండ్ చెల్లించలేని కారణంగా వాళ్ళకి సీట్లు దొరకలేదు. అంచేత...."

"ఆ నలభై చిల్లర మంది మీకేమవుతారు?"

విద్యాసాగర్ చిరునవ్వు నవ్వాడు. "ఏమీ అవరు!"

"అయితే ఎందుకు తీసుకొచ్చారు?"

"అడ్మిట్ చేయడానికి!"

"మ్యాచింగ్ గ్రాంట్ సమకూర్చకపోతే ప్రభుత్వం పైసా ఇవ్వదు. ఈ బిల్డింగ్ యేడాదేడాదికీ చిన్నగా అయిపోతుంది! అందుకే బిల్డింగ్ ఫండ్ విషయంలో ఖచ్చితంగా వ్యవహరించాలని 'కాలేజీ బోర్డు' నిశ్చయించింది. బిల్డింగ్ ఫండ్ చెల్లిస్తేగానీ సీట్లు దొరకవు...."

"అదంతా వాళ్ళ పేరెంట్సుకి ఎప్పుడో చెప్పారు, మీరు!" విద్యాసాగర్ అడ్డొస్తూ అన్నాడు.

"అయితే మళ్ళీ ఎందుకొచ్చారు? అందర్నీ మూకుమ్మడిగా కూడదీసుకుని అగడం చేయడానికి వచ్చారా?"

ప్రిన్సిపాల్ దబాయింపుగా అడిగాడు.

"ఆగడం చేయడానికి కాదు; వీళ్ళందర్నీ అడ్మిట్ చేయడానికి!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు.

"సారీ....లాభంలేదు. ఒక్కొక్కరుగా వచ్చినా, అందరూ ఒక్కటిగా వచ్చినా నేనేం చేయలేను. అయామ్ హెల్ప్‌లెస్!" అంటూ ప్రిన్సిపాల్ తన యెదురుగా యింకా కూచునే వున్న వ్యక్తివేపు విసుగ్గా చూశాడు. "ఏదో త్వరగా తేల్చండి! అవతల మాకు బోల్డంత కామాటం...."

విద్యాసాగర్ లాగిన కుర్చీచప్పుడు ప్రిన్సిపాల్‌కి అడ్డు తగిలింది. విద్యాసాగర్ కుర్చీలో కూచున్నాడు. ముందుకు వాలి, రెండు మోచేతుల్నీ టేబుల్ మీద ఆన్చుకున్నాడు. బట్టతలతో గుండ్రంగా టేబులు మీదున్న గ్లోబులా అవుపిస్తున్న ప్రిన్సిపాల్ మొహంలోకి నిదానించి చూశాడు.

"ప్రిన్సిపాల్ గారూ, అతనూ మీరూ యెంతసేపట్నుంచీ కబడీ ఆడుతున్నారో నాకు తెలీదు; ఇద్దరి మధ్యా బేరం కుదరదని మాత్రం తెలుసు! అంచేత, నేను తీసుకువచ్చిన నలభైనలుగుర్నీ, ఇతని కొడుకునీ— మొత్తం నలభైఅయిదు మంది స్టూడెంట్స్‌ని మీరు వెంటనే అడ్మిట్ చేసుకుంటారు...."

ప్రిన్సిపాల్ పీతాంబరం నుదురుమీద నిలువుగా, అడ్డంగా—కొత్తపాలేరు వంకర టింకరగా దున్నిన పొలంలో నాగేటి చాళ్ళలా—గీతలు పడ్డాయి. "అది చెప్పడానికి మీరెవరు?"

ఉరిమి చూస్తున్న ప్రిన్సిపాల్ కళ్ళల్లోకి విద్యాసాగర్ చిరునవ్వుతో చూశాడు. "వాళ్ళందరి తరఫునా

మీ బిల్డింగ్ ఫండ్ చెల్లించే 'రాజ రాజ పోషకుణ్ని!"

"వాట్? ఏమిటీ!" ప్రిన్సిపాల్ అర్థం కానట్టు చూస్తూ అరిచాడు.

విద్యాసాగర్ తన వెనగ్గా నుంచున్న విద్యార్థినీ విద్యార్థుల గుంపుని ఎడంచేత్తో చూపించాడు. "వీళ్ళు చెల్లించాల్సిన బిల్డింగ్ ఫండ్ చెల్లించడానికి వచ్చిన వ్యక్తిని!...."

ప్రిన్సిపాల్ పీతాంబరం కళ్ళద్దాల్ని తీసేశాడు. ఎర్రగా వున్న ఎడమకంటినీ మామూలుగా వున్న కుడికంటినీ వేళ్ళతో ఒకసారి రుద్దుకున్నాడు. పెన్ ప్యాంట్ మీద జాగ్రత్తగా మడతపెట్టి వుంచిన తెల్లటి గుడ్డతో కళ్ళద్దాల్ని పాలిష్ చేశాడు. అంతసేపూ విద్యాసాగర్ మొహంమీదే వున్న కళ్ళకి అద్దాల సహాయాన్ని అందించాడు. సాలోచనగా బుర్రని రుబ్బురోలులా ఊగించాడు.

"ఐసీ....అంటే...."

"వీళ్ళంతా ఇంటర్ ఫస్టియర్‌లో అడ్మిషన్ కోరుతున్నారు. ఒక్కొక్కరు చెల్లించాల్సిన బిల్డింగ్ ఫండ్ మొత్తం యెంత?" విద్యాసాగర్ నిర్లక్ష్యంగా ప్రశ్నించాడు.

"ఇంటర్ స్టూడెంట్స్ వెయ్యేసి రూపాయలు ఇవ్వాలని నిశ్చయించాం....మీరు...."

"వెయ్యి రూపాయలు మొత్తం బాగాలేదు. ఒక్కొక్కరికీ వెయ్యినూటపదహార్లు నేను చెల్లిస్తాను. వాళ్లందర్నీ వెంటనే అడ్మిట్ చేసే యేర్పాట్లు చేయండి" విద్యాసాగర్ అడ్డు తగుల్తూ అన్నాడు.

ప్రిన్సిపాల్ పీతాంబరం నమ్మలేనట్లు చూశాడు.

కళ్ళద్దాలను తీయబోయి, మానుకున్నాడు.

"యువర్ గుడ్ నేమ్?...."

"ఇందాకే చెప్పాను: విద్యాసాగర్."

"మిస్టర్ విద్యాసాగర్, ఇంతకీ మీరెవరు?"

"అది మనకి అనవసరము........త్వరగా వీళ్ళ పని చూడండి!"

"అఫ్‌కోర్స్....అంతమంది కోసం అంత మొత్తాన్ని పే చేస్తున్న మీరెవరో తెలుసుకోవాలనీ....ఈ ఊళ్ళో యింతవరకూ మిమ్మల్ని చూడలేదు....మీరు....మీరు....ఎవరు....?" ప్రిన్సిపాల్ ఆగుతూ, ఆగుతూ అన్నాడు.

"మీకు నేను చెల్లించే బిల్డింగ్ ఫండ్ కావాలా? నా పేరూ, ఊరూ, కులమూ, గోత్రమూ కావాలా?" విద్యాసాగర్ నవ్వుతూ ప్రశ్నించాడు.

ప్రిన్సిపాల్ అతి ప్రయత్నంమీద పళ్ళికిలించాడు. "అఫ్....కోర్స్...." అంటూ కాలింగ్ బెల్ నొక్కాడు. బంట్రోతు లోపలికి వచ్చాడు. గుమాస్తాని పిలవమని ఉత్తరువిచ్చి, ప్రిన్సిపాల్ కుర్చీలో ముందుకి జరిగాడు.

తన ప్రక్క కుర్చీలో శిలావిగ్రహంలా కూచున్న వ్యక్తిని విద్యాసాగర్ తలతిప్పి చూశాడు. "వెళ్ళి మీ అబ్బాయిని పట్టుకురండి!"

అతను ఆదరాబాదరా పైకి లేచాడు. "తమరు....యెవరో గానీ, చాలా పెద్ద సహాయం చేస్తున్నారు. మీ రుణం...."

"మొదట కన్నందుకు మీ కొడుకు రుణం తీర్చుకోండి....! వెళ్లండి....!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు.

అతను పంచె ఎగబట్టుకుని ఆదరాబాదరా గుమ్మంవేపు

పరుగెత్తాడు.

విద్యాసాగర్ని మళ్ళీ యేదో అడగబోతున్న ప్రిన్సిపాల్ని, లోపలికి వచ్చిన గుమాస్తా రాక అటకాయించింది.

“పిలిచారా, సార్” గుంపుగా వున్న స్టూడెంట్స్ని కంగారుగా చూస్తూ గుమాస్తా ప్రశ్నించాడు.

“చూడు సుబ్బరత్నం, విద్యాసాగర్ గారు వీళ్ళందరికీ బిల్డింగ్ ఫండ్ చెల్లిస్తున్నారు. అందరికీ సీట్లిచ్చేయ్!” అంతమంది తరఫునా డబ్బు చెల్లించబోతున్న విద్యాసాగర్ని గుమస్తా సుబ్బరత్నం కొత్తరకం పిచ్చివాణ్ణి చూస్తున్న పిచ్చాసుపత్రి డాక్టర్లా చూశాడు. మెల్లిగా చూపుల్ని ప్రిన్సిపాల్ వైపు మళ్ళించాడు.

“మీరు ఘంటా ఆలస్యంచేస్తే వీళ్ళందరి పేరెంట్సు నలభైఅయిదుగురూ — ఇక్కడికి వచ్చేస్తారు!” విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు.

“సుబ్బరత్నం వెళ్ళవయ్యా. రాఘవయ్య హెల్ప్ కావాలంటే తీసుకో. జాగర్తగా లెక్కట్టి పైకం తీసుకో. వెయ్యికాదు; విద్యాసాగర్ గారు నూటపదహార్లు కలిపారు. సలక్షణమైన మొత్తం. ఆ రేటున నలభై అయిదుగురికి ఎంతా?”

సుబ్బరత్నం తలకొద్దిగా పైకెత్తి ప్రిన్సిపాల్ వెనక గోడకి వేళ్ళాడుతున్న శ్రీనివాసరామానుజం ఫోటోని చూస్తూ లోపల్లోపలే హెచ్చవేత వేస్తున్నట్టు నటించ సాగేడు.

విద్యాసాదర్ సంచిలోంచీ వందరూపాయల నోట్ల కట్టల్ని తీసి టేబుల్ మీద నిర్లక్ష్యంగా పడేశాడు. గుడ్లు వెళ్ళగించి చూస్తున్న ప్రిన్సిపాల్ని నవ్వుతూ

చూశాడు.

"అది యాభై వేలు. నలభైఅయిదు వెయ్యమూట పదహార్లు యాభై వేలా రెండువందలా ఇరవై....తీసుకోండి...." అంటూ జుబ్బా జేబులోంచి పర్సుతీశాడు. పర్సులోంచి రెండు వందరూపాయలనోట్లనీ, ఒక ఇరవై రూపాయల నోటునీ తీసి టేబుల్ మీద పరిచేశాడు.

"థాంక్స్ " అంటూ ప్రిన్సిపాల్ నోట్లకట్టల్ని బాత్తిగా పెట్టాడు. సుబ్బరత్నంవైపు ఉత్సాహంగా చూశాడు, "చూసుకోవయ్యా. జాగర్తగా లెక్కెట్టుకో. జాగర్తగా కాలేజీ బిల్డింగ్ ఫండ్ ఎకౌంట్‌లో జమ చేసెయ్. పనికాగానే పాస్‌బుక్ నాకు చూపించు...."

సుబ్బరత్నం చూపుడువేలిని నాలుకమీద అద్ది నోట్లు లెక్కించడం ప్రారంభించాడు.

"అబ్బాయిలూ, అమ్మాయిలూ మీరంతా వరండాలో నుంచోండి. ఇతను ఒక్కొక్కర్నే పిలుస్తాడు" ప్రిన్సిపాల్ స్టూడెంట్స్‌ని ఆదేశించాడు.

విద్యాసాగర్ తలతిప్పి, కదలకుండా నించున్న స్టూడెంట్స్‌ని చిరునవ్వుతో చూశాడు. అందరి మొహాలూ మెరుస్తున్నాయి. సువర్చల మొహం మరీ! "ప్రిన్సిపాల్ గారు చెప్పినట్లు చేయండి. కాసేపట్లో నేను వస్తాను."

స్టూడెంట్స్ నవ్వు మొహాల్తో కదిలారు. ప్రిన్సిపాల్ విద్యాసాగర్ వైపు చూశాడు.

"మిస్టర్ విద్యాసాగర్, యూ ఆర్ జనరస్! యూ ఆర్ గ్రేట్! అపరిచితులైన విద్యార్థులకోసం అరలక్ష ఖర్చుచేస్తున్న మీలాంటి వాళ్ళు దేశంలో చాలా అరుదు. ప్లీజ్ టెల్ మీ. హూ ఆర్ యూ?"

"విద్యార్థి సంక్షేమ సమాఖ్య ఫౌండర్ ప్రెసిడెంట్ ని."

• • •

తన ఇల్లున్న సందు మలుపు తిరగబోతూ సువర్చల తటాలున ఆగింది. ఆశ్చర్యంతో, ఆనందంతో ఆమె కళ్ళు విచ్చుకున్నాయి.

రోడ్డువారగా చిరునవ్వుతో నుంచున్న అతనివైపు జోరుగా అడుగులేసింది. విద్యాసాగర్ ఆమెకి తెల్లటిపళ్ళు చూపించాడు.

"సీటుమీద కూచున్నావా?" నవ్వుతూ అడిగాడతను.

"మిమ్మల్ని తలుచుకుంటూ కూచున్నా, అంకుల్!" సువర్చల నవ్వింది.

"కంగ్రాట్స్!"

"కంగ్రాటూస్, థాంక్స్యూ—అన్నీ మీకే చెప్పాలి అంకుల్!"

జవాబుగా అతను నవ్వాడు.

"అంకుల్ ...."

"యస్, యంగ్ లేడీ?"

"చీకూ చింతా లేకుండా అంతడబ్బు మా అందరి కోసం కట్టేశారు! అంత డబ్బు మీకెక్కడిది అంకుల్? సమాఖ్యకి పెద్ద ఎత్తున విరాళాలు పోగుచేశారా?" సువర్చల కుతూహలంగా అడిగింది.

"ఏం?"

"టైప్ నేర్చుకుంటున్నాను. పూర్తయ్యాక జాబ్ టైపింగ్ ప్రారంభించి, సంపాయించిందాంట్లో సగం సమాఖ్యకి రెగ్యులర్ గా డొనేట్ చేయాలనుకుంటు

న్నాను!" సువర్చల కళ్ళు మెరుస్తున్నాయి.

"గుడ్ కిడ్!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు. "డోంట్ బాదర్. నేను విరాళాలు వసూలుచేయను!"

సువర్చల ఆశ్చర్యంగా చూసింది. "అయితే.... అంత డబ్బు వ్యాపారం చేస్తున్నారా?"

"ఆ."

"ఏ వ్యాపారం?"

సువర్చల కళ్ళల్లోని కుతూహలాన్ని విద్యాసాగర్ చిరునవ్వుతో చూశాడు. "డబ్బు!"

సువర్చల అర్థంకానట్టు చూసింది. "అంటే....?"

"డబ్బు వ్యాపారం!" విద్యాసాగర్ నవ్వుతూ అన్నాడు.

సువర్చల అతనితో శృతికలిపింది. "అంకుల్........ కాలేజీ ముందూ, చెట్టుకిందా, మీకోసం చూశాం...."

"దేనికి?"

"అందరం మీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలను కున్నాం. మీరు అవుపళ్ళేదు. అంతా నిరాశగా వెళ్ళి పోయారు. అయితే, అయాం లక్కీ!"

విద్యాసాగర్ గులాబిరంగు వోణీ కప్పిన ఆమె భుజం మీద తన కుడిచేతిని వేశాడు. ఆమె విశాల నేత్రాల్లోకి తదేకంగా చూశాడు. "నాకు కృతజ్ఞత చెప్పుకునే పద్ధతి ఒకటి వుంది. అదేమిటో చెప్తాను. చేస్తావా?"

"తప్పకుండా, అంకుల్. చెప్పండి!"

విద్యాసాగర్ ఆమెకి ఇంకొంచెం దగ్గరగా జరిగాడు. అటూ, ఇటూ చూశాడు. తగ్గు స్వరంలో చెప్పడం ప్రారంభించాడు. వింటున్న సువర్చల ముఖం ఉద్రేకంతో ఎర్రబడసాగింది....

# 3

జీపు గేటుముందు ఆగింది. అతను కిందికి దిగాడు. కాస్సేపట్లో ఆమె వెనకవైపునుంచీ కిందికి దిగి, అతనివేపు నడిచింది. ఆమె భుజానికి వ్యానిటీబాగ్ వేళ్ళాడుతోంది. ఎడంచేతిలో దళసరిగా వున్న ఫైలుంది. ఆమె ఎడం చేతికి చిన్న రిస్టువాచీ వుంది. కుడిచేతికి గాజులు లేవు. అతనికి కొద్దిదూరంలో, భయభక్తులతో నిలబడిందామె. ఆమె చూపులు గేటువైపు తిరిగి నుంచున్న అతనిమీదే వున్నాయి.

పొడుగాటి ఆకారం, డార్క్ కలర్ సూటు, నిగనిగలాడుతున్న బూట్లు. అతని క్రాపు గాలికి రెపరెపలాడుతోంది.

సిల్కు పంచా, జుబ్బా ధరించిన భారీ వ్యక్తి గేటువైపు జోరుగా వస్తున్నాడు.

"గుడ్‌మార్నింగ్, సార్! రండి; దయచేయండి. ఫోన్లో చెప్పిన టైముకి తంచనుగా వచ్చేశారు!" అన్నాడతను.

"నమస్తే" అంటూ సూటు వ్యక్తి జీపువైపు తిరిగాడు.

"అచ్ఛా! నువ్వెళ్ళవోయ్. సబ్‌కలెక్టర్ గారికి థాంక్స్ చెప్పు...."

జీపు డ్రైవరు వినయంగా చూశాడు. "మళ్ళీ ఎన్ని గంటలకి రమ్మంటారు సార్?"

"మళ్ళీ రావొద్దు. క్యాంప్ వెళ్ళాలన్నాడు అనిల్ కుమార్. పని ముగించుకుని రాత్రికి కల్సుకుంటానని ఆయనకి చెప్పు. వెళ్ళిరా."

"అలాగే సార్. వస్తాను సార్. నమస్కారం సార్!" డ్రైవర్ వినయవిధేయతల్ని తనరూపంలో చూపించి,

జీపు ఎక్కాడు. కాస్సేపట్లో 'ప్రభుత్వ వాహనం' వెళ్ళి పోయింది.

"అన్నట్టు సబ్ కలెక్టర్ అనిల్ కుమార్ గారు తమకి బాగా తెలుసా?" జుబ్బా వ్యక్తి అడిగాడు.

సూటు వ్యక్తి కుడిచెయ్యి అతని నడుము లెవల్లో ఆగింది. "ఇంతప్పట్నుంచీ తెలుసు. సైన్ గై!"

"ఔనౌను. చాకు!"

"చౌదరిగారూ, మనం పూర్తి ఏకాంతంలో మాట్లాడాలి. మీ ఇంట్లో...."

"మనం కూచునే గదిలోకి ఈగలు కూడా రావు. పిలిచినా కూడా నౌఖర్లెవరూ మేడమెట్లు ఎక్కడానికి వీల్లేకుండా ఆర్డర్ వేసేశాను. ఫోన్ లో చెప్పానుగా!" చౌదరి ఉషారుగా అన్నాడు.

అతను మెప్పుగా నవ్వాడు. "సుగుణా...."

యువతి అదరా బాదరా అతని ముందుకి నడిచి, ఆగి, వినయంగా, మౌనంగా చూసింది.

"చౌదరిగారూ, సుగుణ.... నా సి.సి. ఆమె మన కాన్ఫరెన్స్ లో వుంటుంది. మనం అనే మాటలన్నింటినీ ఆమె అక్షరాలుగా మారుస్తుంది!"

"నమస్కారమండీ!" సుగుణ చౌదరిని చూస్తూ అంది.

"నమస్కారం నమస్కారం. రండి వెళ్దాం!" అంటూ చౌదరి గేటువైపు తిరిగాడు....

"ప్రభుత్వోద్యోగి అని మాత్రం తమరు ఫోన్ లో చెప్పారు. తమ పేరూ, హోదా, డిపార్టుమెంటూ— ఇవేం చెప్పలేదు!" కాఫీకప్పు కిందపెట్టి చౌదరి నవ్వుతూ అన్నాడు.

మాటు న్యస్! సోఫాలో వెనక్కి వాలాడు.

"చౌదరిగారూ, నా పేరు భుజంగరావు. నా హోదా అసిస్టెంట్ డైరెక్టర్. నా డిపార్టుమెంటు యాంటీ కరప్షన్ బ్యూరో."

అధికారం, హుందా, తెలివీ కలిసికట్టుగా అవుపిస్తున్న భుజంగరావుని చౌదరి భయభక్తుల్తో చూశాడు. 'అలాగా' అన్నట్టు బుర్ర ఆడించాడు.

"మీ డిపార్టుమెంటుకి నాతో పని వుండటానికి వీల్లేదే!" అన్నాడతను నవ్వుతూ.

"అవినీతి నిరోధకశాఖ — ఏసిబి — అవినీతిపరుల్నే కాదు; మీలాంటి నీతిపరుల్నీ కల్సుకుంటూ వుంటుంది!" భుజంగరావు గంభీరంగా అన్నాడు.

చౌదరి ఉబ్బితబ్బిబ్బవుతూ నవ్వాడు. "చెప్పండి!"

"చెప్తాను. తరవాత అడుగుతాను. తరవాత మీరు చెప్తారు. మన మధ్య సాగే సంభాషణని పూర్తిగా నా పి.ఏ. షార్టుహాండ్‌లో రాసుకుంటుంది...."

"క్షమించాలి. నేను తెలుగుమాత్రం మాట్లాడగలను. దాన్ని ఆమె షార్టుహాండ్‌లో ఎలా రాసుకుంటుంది?" చౌదరి అడ్డుతగిలాడు.

భుజంగరావు చిన్నగా నవ్వాడు. "మన తెలుగుని అప్పటికప్పుడు ఇంగ్లంలోకి లోపల్లోపలే తర్జుమా చేసి సుగుణ రాసేస్తుంది!"

"అలాగా!" చౌదరి మెప్పుగా బుర్ర ఆడిస్తూ సుగుణ వేపు చూశాడు.

"చౌదరిగారూ, కాలేజీ కమిటీలో మీరు మెంబరు. బిల్డింగ్ నిర్మాణం కోసం విరాళాలూ అవీ విరివిగా పోగు చేయడంలో మీరు ప్రత్యేకంగా శ్రమించారు. ప్రస్తుతం

ఆ కార్యక్రమాలకి దూరంగా వుంటున్నారు...."

"మీకెలా తెలుసు?" చౌదరి ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

"అన్నీ తెలుసుకోవడమే మా డిపార్టుమెంటు ప్రధాన కార్యం!" భుజంగరావు సగర్వంగా అన్నాడు, "కాలేజీ వ్యవహారాలకి మీరు దూరం కావడానికి పలు రకాల కారణాలు మాకు తెలిశాయి. వాటిలో చాలా మట్టుకు మీ నిజాయితీని శంకించేవిగా వున్నాయి...."

"అలాంటి అపఖ్యాతుల్ని తట్టుకోలేకే నేను దూరంగా వుంటున్నాను. అయితే, కమిటీ సభ్యుడిగా కొనసాగుతూనే వున్నాను...."

"అది కూడా మాకు తెలుసు. పగ్గాలు పూర్తిగా 'వాళ్ళ' చేతుల్లోకి వదిలేయడం ఇష్టంలేకే మీరు ఇంకా కంటిన్యూ అవుతున్నారనీ మాకు తెలుసు!"

"మీకు అన్నీ తెలిసినట్టే వున్నాయి! నా నిజాయితీని శంకించే కారణాల గురించి మీ శాఖ దర్యాప్తు చేయమందా? కానివ్వండి; ఏం చేద్దాం? ఈతచెట్టుకింద పాలు తాగాను!" చౌదరి నవ్వాడు. ఆ నవ్వులో విరక్తీ, కసీ ధ్వనించాయి.

భుజంగరావు చిన్నగా నవ్వాడు. వాళ్ళిద్దరికీ దగ్గరగా కుర్చీలో కూచున్న సుగుణ బుద్ధిమంతురాలైన విద్యార్థినిలా వంచిన తల ఎత్తకుండా రాసుకుపోతోంది.

భుజంగరావు చౌదరి కళ్ళల్లోకి సాభిప్రాయంగా చూశాడు.

"అవినీతి నిరోధకశాఖ, అవినీతిపరుల్ని మాత్రమే కలుసుకోదని ఇందాకే చెప్పాను. ఇద్దరు వ్యక్తులమీద మాకు పబ్లిక్ కంప్లెయింట్స్ అందాయి...."

అగిన భుజంగారావువైపు చౌదరి నుదురు చిట్లిస్తూ చూశాడు. అతను ఆశ్చర్యాన్ని నటిస్తున్నాడని అతని కళ్ళు మౌనంగా భుజంగరావుకి చెప్తున్నాయి. పబ్లిక్ కంప్లెయింట్ల జన్మస్థానం చౌదరి బుర్రే అని తనకి తెలుసు. తనకి తెలుసని చౌదరికి తెలీదు!

"అలాగా? ఎవరు రాశారు? ఈ ఊళ్ళో ప్రజలకి అంత సామాజిక స్పృహ ఉన్నట్టు నేను అనుకోలేదు!" చౌదరి నవ్వుతూ అన్నాడు.

"చౌదరిగారూ, ఎవరిమీద ఫిర్యాదులు వచ్చాయో మీరు అడగలేదు!" భుజంగరావు నవ్వుతూ అన్నాడు.

"అడగడం దేనికి లెండి! నామీద అయివుండదని నాకు తెలుసు. కల్లు తాగిన వాడికి నోరు కంపు కొడుతుందన్న భయం వుంటుంది. నేను కల్లు తాగలేదు! తరవాత, ఆ ఇద్దరూ ఎవరో నాకు తెలుసు; మీకు తెలుసు!"

"చౌదరిగారూ, పబ్లిక్ కంప్లెయింట్స్‌లో నిజం వుందంటారా?" భుజంగరావు ప్రశ్నించాడు.

"అది పరిశోధించి కనిపెట్టాల్సింది మీరు!"

"అఫ్‌కోర్స్ పరిశోధిస్తున్నాను. కనిపెడ్తున్నాను. అందుకే ఇక్కడున్నాను!"

చౌదరి నిట్టూర్చాడు. "డైరెక్టరుగారూ, ఇప్పటికే ఈ ఊళ్ళోని పాపాలెన్నింటినో మోస్తున్నా; నిష్కారణంగా, ఇది నా తలకు చుట్టుకోదుగా?"

"నిజం చెప్పడానికి మీరు వెనకాడే వ్యక్తి కాదని నేను కనుక్కున్నాను. జరిగిన అన్యాయాన్ని ఎదిరించా లన్న ఆవేశం చాలా మందిలో వుంటుంది. తీరా సమయం వచ్చి, మీలాంటి అధికారులు పరిశీలనకి దిగేసరికి ఆ

చాలామందిలోని ఆ ఆవేశం చల్లారిపోతుంది. 'ఎందుకొచ్చిన తద్దినం?' అనుకుని, సర్దుకుపోతారు. ఆ బలహీన లక్షణం మీలో లేదని కూడా నా పరిశోధన తెలియ చేస్తోంది. అందుకే తతిమ్మా నలుగురు మెంబర్లలో ఎవర్నీ కలుసుకోకుండా మిమ్మల్నే ఎన్నిక చేశాను........" భుజంగరావు ఆగి సిగరెట్ వెలిగించాడు.

"నా వివరణ మీ ప్రశ్నకి పరోక్షంగా సమాధానం చెప్పి వుండాలి. వేలాదిమంది చెల్లించిన లక్షలాది రూపాయలకి మీరు కాపలాదారుగా బాధ్యత స్వీకరించారు. ఆ బాధ్యతని పూర్తిగా నిర్వర్తించాలి: కొంతమంది స్వార్థపరుల దృష్టిలో మీకు చెడ్డపేరు వచ్చినాసరే!"

చౌదరి మళ్ళీ నిట్టూర్చాడు. "అయితే....నన్నేం చేయమంటారు?"

"ఇద్దరు వ్యక్తులు బిల్డింగు ఫండ్‌ని దుర్వినియోగం చేస్తున్నట్టు మాకు తెలియచేయబడింది. అది ఖచ్చితంగా-నిజంగానో, అబద్ధంగా తేలిపోయేదాకా నేను వదలి పెట్టడానికి వీల్లేదు. అది నిజమో కాదో మీలాంటి వ్యక్తులు చెప్పాలి?"

"దుర్వినియోగం జరుగుతున్న మాట నిజమే. ఈ నిజం గురించి, మీకు ఫిర్యాదు చేసినవాళ్ళకే కాకుండా నాకూ తతిమ్మా సభ్యులకీ తెలుసు. అయితే మేం నామమాత్రంగా వున్నాం. మీరు పేర్కొన్న ఆ ఇద్దరు వ్యక్తులూ కాలేజీ బిల్డింగ్ ఫండ్ అకౌంటుని చూస్తున్నారు. బ్యాంకులో లావాదేవీలు ఆ ఇద్దరే జరపగలరు. దాంతో మేం కొరగాకుండా పోయాం...." చౌదరి ఆగి, విచారంతో మూశాడు.

"నా అధికారాన్ని ఉపయోగించి, బ్యాంకు అకౌంటు

పూర్తి వివరాలు తీసుకొన్నాను. జమలూ, ఖర్చులూ అన్నీ ఏయే తేదీన ఎంతెంత వేశారు, ఎంతెంత తీశారు, ఏయే తేదీల్లో ఎవరు సంతకం చేశారు వగైరా వివరాలు. నిన్నటికి నికరంగా నిల్వ ఎంతవుందో నాకు తెలుసు. అయితే ఫిర్యాదులో వున్న అంశాల్నిబట్టి బ్యాంకులో వివిధ తేదీలలో జమ చేయబడిన మొత్తాలు మాత్రమే వసూలు అయ్యాయనీ, ఖాతాలోంచీ తీసుకొన్న మొత్తాలు కాలేజీ భవనం కోసమే ఖర్చు చేయబడ్డాయనీ మనకి రుజువు కావాలి. లేకపోతే, అందులో అంటే డిపాజిట్స్‌లో, విత్‌డ్రాల్స్‌లో అవకతవకలు జరిగాయనీ రుజువు కావాలి!" భుజంగరావు ఆగి, అర్థమైందా అన్నట్టు చూశాడు.

చౌదరి రహస్యం చెప్తున్నట్టు ముందుకి వంగాడు. "డైరెక్టరుగారూ....బ్యాంకు ఖాతాలో జమ చేయబడిన మొత్తాలు ఖచ్చితంగా వసూలైన మొత్తాలు కావు. తీసుకోబడిన మొత్తాలు అసలు పనికే పూర్తిగా వ్యయం చేయబడ్డాయని నేను చెప్పను! ఎందుకంటే రెండు సందర్భాల్లోనూ దుర్మార్గం జరిగింది!"

"మీకెలా తెలుసు? " భుజంగరావు ప్రశ్నించాడు.

చౌదరి తీక్షణంగా అతని కళ్ళల్లోకి చూశాడు. "ఇన్నాళ్ళకి మీరు దర్యాప్తుకి వచ్చారు. మీతో పూర్తిగా సహకరిస్తాను. నా పేరు బైటికి రాకుండా చూస్తానని వాగ్దానం చేస్తారా?"

మళ్ళీ మొదటికే వచ్చిన చౌదరిని భుజంగరావు చిరునవ్వుతో చూశాడు. "మీ పేరు బైటికి రావాలని నాకు తహతహా లేదు. మాటవరసకి మీరిచ్చే ఆధారాల

ఆధారంతో వాళ్ళిద్దర్నీ దోషులుగా నిర్ణయించి, కమిటీ నుండీ తొలగించి, ఆ కమిటీకి మిమ్మల్ని ప్రెసిడెంటుగా, మిమ్మల్నే కోశాధికారిగా చేయాల్సిన అవసరాన్ని మేం గుర్తించే అవకాశాలున్నాయి. ప్రజాధనాన్ని, అమాయకులైన బాలబాలికల ధనాన్ని మీరు ఎందుకు క్షేమంగా కాపాడి, సద్వినియోగం చేయకూడదు? చెప్పండి!"

చౌదరి ఆవేశంతో చూశాడు. బుర్రని కాస్త ముందుకి వూగించాడు. "సరే.... నా పేరు దండోరా వేయబడినా, నాకు ఆ కమిటీ ప్రెసిడెంట్ గిరీ రాకపోయినా ఫర్వాలేదు. జరిగిన అన్యాయాన్ని అన్యాయంగా నిరూపించే సాక్ష్యాధారాల్ని మీకు సప్లై చేస్తాను!"

"వెరీగుడ్! అదే నాక్కావాల్సింది! చెప్పండి!" భుజంగరావు నవ్వుతూ ప్రోత్సహించాడు.

"బ్యాంకులో జమ చేయబడిన మొత్తానికీ, అసలు— నిజంగా వసూలయిన మొత్తానికీ చాలా తేడా వుంది. ఆ తేడా నాకు సంబంధించినంతవరకూ ఎంతో ఖచ్చితంగా చెప్పగలను. ఎందుకంటే ఊరూరూ, కొంప కొంపా తిరిగి వసూలు చేసిన మొత్తాల్ని యే రోజు కా రోజు నేను రాసి వుంచుకున్నాను. నేనే ఆ పని చేసినట్టు ఇప్పటి దాకా రెండో వ్యక్తికి తెలీదు!"

"ఐసీ...."

"కమిటీ యేర్పడ్డాక మేం వసూలు చేసిన మొత్తాల గురించి మాత్రం నాకు తెలుసు. ఇకపోతే విద్యార్థుల తండ్రులూ, సంరక్షకులూ ఎంతెంత చెల్లించారో నాకు తెలీదు. కాలేజీలో యిచ్చుకున్నవాళ్ళనీ నేను వదిలిపెట్టలేదు, మా మొహాలు చూసి మరికొంచెం విరాళం ఇవ్వ

మని పనులు చేశాం! ఈ ఏడూ స్టూడెంట్స్ నుండీ తప్పనిసరిగా బిల్డింగ్ ఫండ్ గుంజుతున్నారు. ఎవడో విద్యాసాగరట. దాదాపు యాభైమందికీ ఎన్నో వేలు చెల్లించాట్ట! తన పైకం బిల్డింగ్ కోసం ఉపయోగించబడుతుందని గుడ్డిగా నమ్మినట్టున్నాడు పాపం!"

"కాలేజీ లెవల్లో ఫండ్ కలెక్షన్ యెంతో కనుక్కోడానికి నా పద్ధతులు నాకున్నాయి. ఆ విషయం అలా వుంచండి. మీరు రాసివుంచుకున్న వివరాలు నాకు అందిస్తారా?" భుజంగరావు ప్రశ్నించాడు.

"తప్పకుండా! ఇస్తాను లెండి...."

"ఈ అక్రమాన్ని నేను సర్వశక్తులూ ఉపయోగించి ఎదిరిస్తాను. తప్పు చేసినవాని తాట వొలిచేస్తాను. దాని కోసం మీరు మరో సహాయం చేయాలి...."

"చెప్పండి!"

"తలిమ్మా మెంబర్లకీ ఇది తెలుసుగా?"

"నేను రాసి పెట్టుకొన్న లెక్కల గురించా? తెలీదు. ఎందుకు వచ్చిన గొడవ అని నేనే గుండెల్లో కుంపటి దాచుకున్నాను!"

"ఆల్ రైట్! వాళ్ళూ మీలాగే కమిటీలో నిర్లక్ష్యం చేయబడ్డారు. మీ దగ్గరున్న వివరాల్ని జోడిస్తూ మీరో స్టేట్ మెంటు రాయండి. ఆ స్టేట్ మెంటులో తలిమ్మ మెంబర్లని సంతకాలు చేయమనండి!"

చౌదరి యిబ్బందిగా చూశాడు. "ఇంతకాలం రహస్యంగా వుంచిన నా లెక్కల గురించి చెప్పి, సంతకాలు చేయమంటే వాళ్ళు.... నా నిజాయితీని శంకిస్తారు. నాకు వ్యక్తిగతమైన కక్షో, వ్యక్తిగతంగా లాభమో వుందని అపార్థం చేసుకుంటారు...."

"వాళ్ళకి నేను చెప్తాను. తగువిధంగా వాళ్ళకి విషయాలు వివరిస్తాను. ఉత్తరోత్తరా కమిటీలో మీరూ వాళ్ళూ మాత్రమే వుంటారు "

"అయితే వాళ్ళని— వెళ్ళి కల్సుకుంటారా?"

"వెళ్ళను. ఈ రోజు వాళ్ళంతా ఇక్కడికి వస్తారు. ఇక్కడే, మీ సమక్షంలో నేను వ్యవహారం నడుపుతాను" భుజంగరావు సీరియస్‌గా అన్నాడు.

"వాళ్ళు....ఇక్కడికి....ఎలా వస్తారు?"

భుజంగరావు చిన్నగా నవ్వాడు. "మీరు రాత్రి యెనిమిది గంటలకి వాళ్ళందర్నీ యిక్కడికి పిలిపిస్తారు!..."

చౌదరి చిన్నగా నవ్వాడు. "మీరు అలా అంటే... అలాగే!"

"ఓకే....ఇంకో విషయం: కాలేజీ భవనం కోసం బ్యాంకులోంచి విత్‌డ్రా చేసిన మొత్తం అందుకోసమే వ్యయం కాలేదన్నారు. అదెలా తెలుసు, మీకు?"

చౌదరి సగర్వంగా నవ్వాడు. "మాటవరసకి నేనే ఆ కార్యక్రమం చూస్తున్నా అనుకోండి. ఫలానా పనికి అంటూ టెండర్లు పిలుస్తాను. నా కావాల్సిన వ్యక్తికి టెండర్ యెంతకి వేయాలో చెవిలో చెప్తాను. సీల్డు టెండర్స్. నా వ్యక్తి టెండర్ని ఆమోదిస్తాను. మాటవరసకి ఒకపనికి లక్షరూపాయల టెండర్ ఆమోదిస్తాను. నిజంగా దాని విలువ యాభై వేలే వుంటుంది. కాంట్రాక్టర్‌కి అడ్వాన్సుగా కొంత మొత్తం ఇస్తాం. అందులో కొంతా, ఆ తరవాత కొంతా మొత్తం యాభై— గుట్టు చప్పుడు కాకుండా తీసేసుకొంటాను. ముప్పై వేలయ్యే పనికి యాభై యిస్తున్నందుకు నా కాంట్రాక్టర్ వాళ్లో

పూర్తిగా సహకరిస్తాడు! ముప్పైవేలూ ఖర్చు చేసెయ్యకుండా ఇసుక రూపంలో తెలివిని ఉపయోగించి యే ఇరవైలో పని ముగిస్తాడు!

"అప్పుడు యిద్దరికీ లాభం. బిల్లూ, వోచర్లూ అన్నిటికి వాడే సప్లై చేస్తాడు. అంతే!" చౌదరి నవ్వుతూ ఆగాడు.

"అయితే ...ఇలాగే జరిగిందంటారా?"

"నిస్సందేహంగా!"

"మీకెలా తెలుసు?"

"కాలేజీ పన్లకి ఖాయం కాంట్రాక్టర్ ఖాన్ వున్నాడు. ఈ మధ్య వాళ్ళమధ్య బెడిసికొట్టింది. మళ్ళీ కాంట్రాక్టులు ఖాన్‌కి వెళ్ళే ప్రసక్తి లేదన్నట్టు 'వాళ్ళ' ఎక్కడో నోరు జారినట్లున్నాడు. తనకి టోపీ వేస్తే మొత్తం కక్కేసి అసలు వ్యక్తుల్ని కైమా చేసేస్తా—నంటూ ఖాన్‌గాడు బెదిరించినట్టు రెండురోజుల క్రితమే నాకు తెలిసింది...."

"అయితే...." భుజంగరావు సాలోచనగా అన్నాడు.

"పైగా గత నెలలో కాంపౌండ్‌వాల్ పని ఖాన్ శత్రువు దామోదరానికి ఇచ్చారు. ఖాన్‌గాడు కారాలూ మిరియాలూ నూరుతున్నాడు. అన్నట్టు....వాడే మీకు కంప్లైంట్ రాయించి వుంటాడు కూడా!" చౌదరి తెలివిగా అన్నాడు.

"ఉండొచ్చు...." ఉండదు అని తెలిసిన భుజంగరావు బుర్ర ఆడిస్తూ అన్నాడు. "నేను ఖాన్‌ని కలుసుకొంటాను."

"చక్కటి ఆలోచన!" చౌదరి మెచ్చుకున్నాడు.

భుజంగరావు సోఫాలో వెనక్కి వాలాడు. "చౌదరి

గారూ, మీ నిజాయితీనీ, ధైర్యాన్నీ మెచ్చుకొంటున్నా. మీ స్టేట్ మెంట్ డిక్టేట్ చేయండి. సుగుణ రాస్తుంది. నా సమక్షంలో సంతకం చేయండి. తరవాత ఇతర సభ్యులకి చదివి, వినిపించి, సంతకాలు తీసుకుందాం...."

"అలాగే...." చౌదరి మెల్లిగా అన్నాడు. "డైరెక్టరు గారూ, మీరు రాకపోతే ఈ దారుణాన్ని కడుపులో రణంలా యింకా ఎంతకాలం భరించాల్సి వుండేదో! మీరు వచ్చారు. అంతా చెప్పి, నా హృదయాన్ని తేలిక పరుచుకొంటున్నా!"

"అది మీ యోగ్యతకి నిదర్శనం!"

"డైరెక్టరుగారూ ఒక పని చేస్తే...." చౌదరి సాలోచనగా అన్నాడు.

"చెప్పండి!"

"మీలాగ డిక్టేషన్ చెప్పడం నాకు అలవాటులేదు. నేనే కూచుని, మెల్లిగా రాస్తాను. ఈలోగా మీరు ఖాన్ దగ్గరకు వెళ్తే?"

"చక్కటి ఆలోచన! వెళ్తాను; మళ్ళీ వస్తాను: రాత్రి యెనిమిదింటికి!" భుజంగరావు నవ్వుతూ పైకి లేచాడు....

# 4

ద్వారబంధానికి అతికించబడిన కాలింగ్ బెల్ బటన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తూ అతను తలుపుమీద దబ దబ బాదాడు. రెండుక్షణాలాగి మరో విడత తలుపుమీద మద్దెల వాయించాడు. మరో రెండుక్షణాలాగి మూడో విడత మద్దెల ప్రారంభించడానికి చెయ్యెత్తాడు.

"ఎవరు?" బొంగురు కంఠం తలుపవతల్నుంచీ కోపంగా గర్జిస్తూ అతని చేతిని గాలిలో స్తంభింప

చేసింది.

"కరెంటు లేదేమో, కాలింగ్ బెల్ మోగదేమో అన్న అనుమానం ఉన్న వ్యక్తిని! తలుపు తెరవండి!" వరండాలో వెలుగుతున్న మిల్క్ వైట్ బల్బుని చూస్తూ, లోపలే నవ్వుకొంటూ అన్నాడతను.

గొళ్ళెం విసుగ్గా చప్పుడు చేసింది. తలుపు విసురుగా లోపలికి జరిగింది. కాలేజీ నుంచీ తిరిగివచ్చినా కూడా, ఇంకా సఫారీ సూట్‌లోనే వున్న ప్రిన్సిపాల్ పీతాంబరం కోపంగా అతనివైపు చూశాడు.

"హూ యీజ్ దట్?"

గుమ్మం ముందు నిలుచున్న వ్యక్తి రెండు చేతుల్నీ కోటు జేబుల్లోకి దోపుకొన్నాడు. "నన్ను గుర్తుంచుకొని వుండాలే!"

పీతాంబరం రౌద్రంగా చూశాడు, "ఏమిటీ మర్యాద లేని ప్రవర్తన? హూ ఆర్ యూ?"

"గుర్తు లేదా? నేను గుర్తులేకపోయినా, నే నిచ్చిన యాభైవేలా చిల్లర బిల్డింగ్ ఫండ్ గుర్తుండి వుండాలే! కనీసం, కమీషన్ పోగా కాలేజీ లెక్కల్లోకి ఎక్కించిన 'భాగం' బిల్డింగ్ ఫండేనా గుర్తుండి వుండాలే!" అతను నవ్వుతూ అన్నాడు.

పీతాంబరం మొహం ఎర్రగా మారింది. నుదురూ, కనుబొమలూ అష్టవంకర్లు తిరిగాయి. ఫుల్ సూటులో ఠీవిగా, నిర్లక్ష్యంగా నిలబడి చిరునవ్వు నవ్వుతున్న పొడుగాటి వ్యక్తిని అతని కళ్ళు ఎగాదిగా రెండుసార్లు సర్వే చేశాయి. మెల్లిగా అతని కనుబొమలు పాతరూపానికి వచ్చాయి.

"ఓహ్.........యూ.........విద్యాసాగర్! పైజమా

జూబ్బాలో అప్పుడు చూసి, ఇప్పుడు సూటులో చూస్తూ, పోల్చుకోలేకపోయాను....ఆల్ రైట్....యేమిటి? అర్థం పర్థం లేకుండా యేమిటో అన్నారు?"

"అన్న మాటలకి అర్థం చెప్పాలంటే మనిద్దరం నీ అంతఃపురంలో కాంతిమయంగా కూచోవాలి!" అతను నవ్వుతూ అన్నాడు.

"వాట్ ఈజ్ దిస్? వాట్ డూ యూ వాంట్?" ఏకవచనంతో రోషం ఎక్కించుకొన్న పీతాంబరం బొంగురుగా అన్నాడు.

"నీ ఇంగ్లీషు ప్రశ్నలకి నా తెలుగు సమాధానాలు వింటే, తక్షణం కళ్ళు బైర్లు కమ్మి గడపకి ఇటువేపున తలుండేం, అటువైపు కాళ్ళూ ఉండేలా పడిపోతావ్! అంచేత...."

"విద్యాసాగర్! దిసీజ్ . "

"అయామ్ నాట్ విద్యాసాగర్" అతను అడ్డుతగుల్తూ అన్నాడు.

"వాట్? దెన్....అయితే....నువ్వు...."

"ప్రిన్సిపాల్, నన్ను సగౌరవంగా లోపలికి తీసుకెళ్ళకపోతే, నీ బతుకు బజారుపాలైపోతుంది...."

"నాన్ సెన్స్! గెట్...."

"షటప్! కాలేజీ కమిటీ మెంబర్లు చౌదరి, రాఘవాచారి, జనార్దన గుప్త, సోమలింగం, రామరత్నం—ఈ అయిదుగుర్నీ, నీ ప్రాణమిత్రుడు—ప్రస్తుతం నీ ప్రాణాలు తీయాలనుకుంటున్న కాంట్రాక్టర్ ఖాన్ నీ కలుసుకొని, వాళ్ళు చెప్పిందంతా చెవులారా విని, ఇక్కడికొచ్చాను. లోపలికి ఆహ్వానించి, నువ్వు జీతం డబ్బుల్తో కాకుండా, వేరే పైకంతో ఖరీదు చేసిన అతి మెత్తటి సోఫాలో

కూచోబెడితే, వాళ్ళు చెప్పిందంతా నీ చెవిలో వేస్తాను!" అతను నవ్వుతూ అన్నాడు.

పీతాంబరం అర్థం కానట్టు చూశాడు. ఎదురింటి వరండామీద నిలబడి, తన గుమ్మంవేపే శ్రద్ధగా చూస్తున్న వ్యక్తిని చూస్తూ తలుపు బార్లా తెరిచాడు.

"లోపలికి రా!" అన్నాడు అయిష్టతను నటిస్తూ.

పీతాంబరం అయిష్టతని నటించడం తేలిగ్గా గుర్తిస్తూ అతను చిరునవ్వు నవ్వాడు. కమిటీ మెంబర్ల పేరులూ, ముఖ్యంగా కాంట్రాక్టర్ ఖాన్ పేరూ 'ఓపెన్ సెసేమ్' మంత్రంలా పీతాంబరంమీద పని చేశాయని తనకి తెలుసు. గుమ్మం దాటి అతను లోపలికి జరిగాడు.

పీతాంబరం తలుపు మూసేశాడు. అతని వీపు తలుపుకి ఆన్చి, ఏటవాలుగా నిలబడి నవ్వుతూ చూశాడు.

"ఇప్పుడు చెప్పు: విద్యాసాగర్ కాకపోతే, యెవర్నువ్వు?" పీతాంబరం ప్రశ్నించాడు.

అతను కోటు జేబుల్లోంచి రెండు చేతుల్నీ తీశాడు. ప్రత్యక్షమైన సిగరెట్ పాకెట్నీ, అగ్గిపెట్టెనీ చిరునవ్వుతో చూస్తూ సిగరెట్ ఇవతలికి తీశాడు. సిగరెట్ని పై పెదాలకి అతికించాడు. పాకెట్ని జేబులోకి జారవిడిచి, అగ్గిపుల్ల గీశాడు. సిగరెట్ కొసని మంటలో గుచ్చాడు. తల పైకెత్తి, కోపంగా చూస్తూన్న పీతాంబరం బుల్డాగ్ మొహం వైపు పొగను ఊదాడు.

"పీతాంబరం, అయామ్ శివరామ్."

పీతాంబరం విసుగ్గా చూశాడు. "ఎవర్నువ్వు?"

శివరామ్ కనుబొమల్ని పైకెత్తుతూ చూశాడు. మెల్లిగా చిరునవ్వు నవ్వాడు. "పీతాంబరాన్ని దిగంబరంగా

మార్చే మాంత్రికుణ్ని!"

పీతాంబరం పిడికిళ్ళు బిగించాడు. కోపంతో అతని దవడలూ- పెదవులూ వణికాయి. "అర్ధమయ్యేలా మాట్లాడకపోతే నీ పీటికి గొంతి తలూ పిస్తాను!"

శివరామ్ పకపక నవ్వాడు. "నా అర్ధం నీకు అర్ధమయ్యే వుండాలి. లేకపోతే కాలేజ్ కమిటీ సభ్యులూ, కాంట్రాక్టర్ ఖాన్ అనగానే తలుపు బార్లా తెరిచి రెండు చేతుల్తో నన్ను ఆహ్వానించి వుండవు!"

పీతాంబరం పెదవులు కదిలాయి. ఏదో చెప్పబోయిన అతను మానుకున్నాడు.

"పీతాంబరం, పద. సోఫాలో కూచో!" శివరామ్ తలుపు నుంచీ దూరంగా జరుగుతూ అన్నాడు. పీతాంబరంని దాటివెళ్ళి హాలుమధ్యలో వున్న సోఫాలో తనే ముందుగా కూచున్నాడు. చెరువునీళ్ళలో కాళ్ళీడ్చుకొంటూ నడిచే వ్యక్తిలా తచ్చాడుతూ నడుస్తున్న పీతాంబరాన్ని చిరునవ్వుతో చూశాడు.

"భద్రంగా సోఫాలో కూచో. లేకపోతే కూలిపోతావ్!" శివరామ్ అతన్ని హెచ్చరించాడు.

పీతాంబరం కూచుని మాటలు మరిచిపోయినవానిలా చూశాడు. సిగరెట్ పొగని రింగులా ఊది, శివరామ్ ప్రారంభించాడు.

"పీతాంబరం, నీ కోసం ఈ వారం రోజుల్లో నేను అనేక అవతారాలు ఎత్తాను. విద్యార్థి సంక్షేమ సమాఖ్య ఫౌండర్ ప్రెసిడెంట్ విద్యాసాగర్, యాంటీ కరప్షన్ బ్యూరో అసిస్టెంట్ డైరక్టర్ భుజంగరావు, క్వాలిటీ కంట్రోలర్, కన్‌స్ట్రక్షన్స్, గవర్నమెంటాఫ్ ఆంధ్రప్రదేశ్—యథార్థానికి ఈ పోస్టు లోకంలో

లేవనుకో—ఇవి మూడు అవతారాలు. ఇప్పుడు నీకు చూపిస్తున్న రూపం నా మూలరూపం...."

"ఏమిటిదంతా? ఎందుకిదంతా చేశావు?" పీతాంబరం అద్భుతగుల్తూ బొంగురుగా ప్రశ్నించాడు.

"చెప్తాను!" శివరామ్ నవ్వుతూ సిగరెట్‌ని మూలకి గిరిచూసి నవ్వాడు.

"నీలాంటి వ్యక్తుల గతచరిత్రల్ని తవ్వి, వర్తమాన చరిత్రల్ని కలిపి, ఆ మిశ్రమంతో దుర్భిణీ తయారుచేసి భవిష్యత్తు చరిత్రల్ని చూపించడం నా హాబీ...."

"మిస్టర్ పిచ్చివాగుడు కట్టిపెట్టి, వచ్చిన పనేమిటో అర్థమయ్యేలా చెప్పు!" పీతాంబరం గర్జించాడు.

"గతంలో నువ్వు పనిచేసిన కాలేజీల్లో, బిల్డింగ్ ఫండ్ స్వాండ్లింగ్ ఎక్స్‌పర్టుగా నీకు గొప్ప పేరుందని కని పెట్టాను. అందుకే అడ్మిషన్ సీజన్ అయిన ఈ వారంలో నీ కోసం వచ్చాను. చాలా నిష్కర్షగా మాట్లాడుతూ, నిరంతరంగా బిల్డింగ్ ఫండ్ వసూలు చేస్తున్నట్టు కని పెట్టాను. నువ్వు తన్ని తగిలేసిన బీదవిద్యార్థుల తరఫున బిల్డింగ్ ఫండ్ చెల్లించాను. తరవాత "

"ఏమిటీ వాగుడు? ఆయామ్ నాట్ ఇంటరెస్టెడ్!" అరుస్తూ పీతాంబరం పైకి లేచాడు.

"తరవాత కాలేజీకోసం నువ్వు తయారుచేసిన కమిటీ గురించి వాకబు చేశాను. నువ్వూ, నీ తోడుదొంగ గున్నేశ్వర్రావూ చేతులు కలిపారు. అతను కమిటీ ప్రెసిడెంటు. బిల్డింగ్ ఫండ్ అకౌంటుని చూసుకునే వ్యక్తులు మీ ఇద్దరే. నీ తెలివీ, ప్లానింగూ, గున్నేశ్వరరావు ఐశ్వర్యమూ, పలుకుబడీ తతిమ్మా మెంబర్లని అచిర కాలంలో డమ్మీలుగా మార్చేశాయి...."

"నాన్ సెన్స్!"

"నా పరిశోధన ప్రకారం ఈ నాలుగేళ్లలో పదిహేను లక్షలు మీరంతా విరాళాల రూపంలో బిల్డింగ్ ఫండ్‌కి పోగేశారు. నాలుగేళ్ళుగా స్టూడెంట్స్ నుంచీ దాదాపు నాలుగు లక్షలు వసూలు చేశావ్...."

"అబద్ధం! ఇదంతా పచ్చి అబద్ధం!" పీతాంబరం బొబ్బలెట్టాడు.

"బ్యాంక్ ఖాతా, కాలేజి రికార్డులూ చాలా చాలా తక్కువ మొత్తాన్ని చూపిస్తున్నాయి అది నికరంగా బ్యాంక్ ఖాతాకి జమ అయిన మొత్తమే. అయితే దాంతో నాకు పనిలేదు. వసూలయిన పైకంతోనే నాకు పని!"

"వసూలయిన మొత్తం, మొత్తం బ్యాంక్‌లో జమ చేయబడింది! ఇంతకూ ఈ లెక్కలు అడిగే హక్కు నీకెవడిచ్చాడు? హూ ఆర్ యూ మిస్టర్?"

"అలాంటి హక్కుని నాకు నేనే ఇచ్చుకొనే వ్యక్తిని!" శివరామ్ సగర్వంగా అన్నాడు.

"నీ బోడి హక్కుని ఇక్కడ గుర్తించే వెధవ ఎవడూ లేడు! గెట్ ఔట్!"

"కాసేపట్లో నువ్వే ఆ హక్కుని—బోడి హక్కుని—భయభక్తులతో గుర్తిస్తావ్ పీతాంబరం!" శివరాం నవ్వుతూ అన్నాడు. "ప్రస్తుతం బ్యాంక్ ఖాతాలో రెండులక్షలా ముప్పైఎనిమిది వేలా వందా నాలుగు రూపాయలా ఎనభై ఏడు పైసలున్నాయి...."

"నీకెలా తెలుసు?" పీతాంబరం అసంకల్పితంగా అడిగాడు.

"నాక్కాదు; ఏసీబీ భుజంగరావుకి తెలుసు!" శివరాం నవ్వుతూ అన్నాడు. "విత్ డ్రాల్స్ రూపంలో నాలుగు లక్షలా డెబ్బైఅయిదు వేలా అయిదువందలు గాల్లో కలిశాయి...."

"గాలిలో కాదు; కాలేజీ బిల్డింగ్ పనికే ఖర్చయ్యాయి! నిజానిజాలు తెలీకుండా వాగుతున్నావ్!"

"కాలేజీ బిల్డింగ్! హు! నువ్వు ఏమేం కట్టావో, బిల్డింగ్ని ఎంత డెవలప్ చేశావో నాకు తెలుసు. నీ ఆఫీసు గదిని ఇంద్రభవనంలా కట్టించుకున్నావ్. మొసా యిక్ రోజ్ ఉడ్ ఫర్నిచర్, కర్టెన్స్. అటాచ్డ్ బాత్ విత్ షవర్. వగైరా వగైరా. ప్రిన్సిపాల్ ఆఫీసు గది అధునాతనంగా తయారైతే అది కాలేజీ బిల్డింగ్ డెవలప్మెంట్ అనిపించుకోదు. నీ గది సినిమా సెట్టింగ్లా వుంటే బిల్డింగ్ ఫండ్ చెల్లించే విద్యార్థులకి ఒరిగేదేమీలేదు!"

"ఆల్రైట్....నువ్వనేదేమిటి?"

"అంటున్నా; వింటూ కూచో!" శివరాం ఎగతాళిగా అన్నాడు. "ఇకపోతే, పోతేపోనీ అని దయదలచి కాంపౌండ్ వాల్ కట్టించావ్. అది కూడా స్టూడెంట్స్కి అట్టే ఉపయోగించదు. ఇంటర్వెల్లో గోడమీద వాళ్ళు కూర్చోడానికి వీల్లేకుండా గాజుపెంకులు గుచ్చిపెట్టించావ్! నాలుగు లావెటరీలు, వోవర్ హెడ్ ట్యాంకూ యేర్పాటుచేయడానికి హైప్లాన్ అంచనాలు తయారు చేశావ్. పని విలువ పెంచి, కంట్రాక్టర్తో లాలూచీ పడి, నాసిరకం నిర్మాణంతో నీ జేబులూ, కాంట్రాక్టర్ జేబులూ, గున్నేశ్వర్రావు జేబులూ నింపావు!"

"ఇంకా?" పీతాంబరం ఎగతాళిగా అన్నాడు.

"ఇంకా, వంద బస్తాల సిమెంటు కొంటే, యాభై బస్తాల్నీ, అలాగే యితర సరంజామానీ నీ కొంపకి చేర్చు కొన్నావ్. నీమీద అలిగి రసాభాస చేయకుండా వుండటా నికి గున్నేశ్వర్రావుకీ సమంగా వాటా ఇచ్చావ్..."

"ఓహో! ఇంకా?"

"వసూలైన మొత్తంలో యింతో కొంత పర్సెం టేజ్ని లెక్కల్లోకి తీసుకొని, బ్యాంకులో గిరాటేసి, తతిమ్మా మొత్తాన్ని మీ గుంటనక్క లిద్దరూ పంచు కున్నారు. కాలేజీ లెక్కల్లో నీ వాటకాన్ని రక్షికట్టించ డానికి గుమాస్తాని వాడుకొన్నావ్. అతనికీ మేత వేస్తూనే వున్నావ్!"

"అయ్యిందా?"

"ఇంకా వుంది"

"స్టాండప్! ఐసే, స్టాండప్!" పీతాంబరం ఉరు ములా అరిచాడు.

ఎర్రగా కందిన అతని మొహంలోకి శివరామ్ నవ్వుతూ చూశాడు. "లేవమంటే లేస్తాను. కానీ, నేను లేస్తే నువ్వు నేలకరుచుకుపోతావ్! స్వాహా చేసిన బిల్డింగ్ ఫండ్తో నీ యిద్దరు కొడుకులకీ-ఎంట్రెన్స్ ఎగ్జామ్స్లో మట్టికరిచిన యిద్దరికీ—యాభై వేలు చొప్పున డొనేషన్స్ కట్టి కర్నాటకలోని రామ్నగర్లో ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలో సీట్లు సంపాయించావ్. అట్లాగే నేషన్తో నీ కూతురికి ప్రైవేట్ మెడికల్ కాలేజీలో సీటు సంపాయించావ్. హైదరాబాదులో, తిరుపతిలో, యిక్కడా మూడే మూడు బంగళాలు సంపాయిం చావ్!"

పీతాంబరం ఆగ్రహంతో పూనకం వచ్చినవానిలా

ముందుకీ, వెనక్కీ ఊగాడు. తటాలున పక్కకి తిరిగి, గోడవారగా వున్న టెలిఫోన్ వేపు నడిచాడు. శివరామ్ నవ్వుతూ అతన్నే చూశాడు.

"పీతాంబరం...."

పీతాంబరం విసురుగా వెనక్కి తిరిగాడు. నిప్పులు కక్కుతూ చూశాడు.

"పోలీసుల్ని పిలవడానికి వెళ్తున్నావ్! కాకీగుడ్డల్ని అహ్వానిస్తే కైమా అయిపోతావ్!"

"నా ఇంటికి వచ్చి, నామీదే అభాండాలు వేస్తున్న నీ పిచ్చి బతుక్కి ఫుల్‌స్టాప్ పెట్టిస్తాను; రాస్కెల్!"

చిరునవ్వుతో శివరాం రిస్టువాచీ చూసుకున్నాడు. "మరో మూడే మూడు నిమిషాల్లో నీ మిత్రుడు, నీ పార్ట్‌నర్, నీ గురువు, నీ శిష్యుడు గున్నేశ్వర్రావు నీకు ఫోన్ చేస్తాడు. అందాకా ఆగు!"

పీతాంబరం నమ్మలేనట్టూ, నమ్ముతున్నట్టూ. భయపడుతున్నట్టు, ధైర్యంగా వున్నట్టు చూశాడు. అతను కదిలేలోగా శివరాం ప్రారంభించాడు.

"గున్నేశ్వర్రావు నీ చెవిలో గుసగుసలాడేలోగా నీతో రెండు ముక్కలు చెప్తాను. అది ముందే చెప్పి వుంటే బావుండేది; మరిచిపోయాను... మీ ఇద్దరిచేతా నిర్లక్ష్యం చేయబడి, మోసం రుచి చూసిన కమిటీ మెంబర్లు పకడ్బందీగా స్టేట్‌మెంట్స్ ఇచ్చారు ఏసీబీ భుజంగరావుగారికి. మీరిద్దరూ టోపీవేసిన కాంట్రాక్టర్ ఖాన్ ఇద్దరికీ జాయింటుగా కల్తీలేని సిమెంటులో గోరీ కట్టడానికి తహతహ లాడిపోతున్నాడు. తనకి ఒక కన్నుపోయినాసరే, మీ ఇద్దరివీ నాలుగు కళ్ళుపోయి తీరాలని మసీదులో ప్రమాణం చేశాట్ట. జరిగిన కథంతా

పవిత్రమైన ఖురాన్‌లా రాసిచ్చాడు...." శివరాం ఆగి, నెమ్మదిగా సిగరెట్ వెలిగించాడు.

నడవడం మరిచిపోయినవాడిలా, స్లీప్ వాకర్లా, పీతాంబరం సోఫావేపు కదులుతున్నాడు. శివరాం అతన్ని మెప్పుగా చూశాడు. సోఫాముందు ఆగి పీతాంబరం అయోమయంగా చూశాడు. అతని నుదుటుమీద బొబ్బల్లా పుట్టుకొస్తున్న చెమట బిందువులు అతనిలోపల భావాల్ని శుభ్రంగా చూపిస్తున్న గుండ్రటి అక్షరాల్లా వున్నాయి.

"ముఖ్యంగా, కాలేజీలో విద్యార్థులనుండీ ఇన్నేళ్ళగా నువ్వు ఎంతెంత వసూలు చేశావో, నాకోసం — ఐ మీన్ విద్యాసాగర్ కోసం, విద్యార్థులే వివరాలు సేకరించి లెక్క తేల్చారు. ప్రజలనుండీ నికరంగా వసూలైన మొత్తమెంతో చక్కగా రాసివుంచుకున్న చౌదరి ఆ లెక్కల్ని ఏసీబీ భుజంగరావుకి అప్పగించాడు. అన్నింటినీ ఈ శివరాం బోల్డన్ని కాపీలు తీశాడు...."

"నో!"

"తరవాత.... ఈ కరపత్రం చూశావా? నీ కోసం, నీ విద్యార్థిని, విద్యార్థులు అచ్చేయించారు............" అంటూ శివరాం కోటుజేబులోంచి వెడల్పాటి కరపత్రాన్ని ఇవతలికి తీశాడు. చిరునవ్వుతూ దాన్ని ఒకసారి చూసి, టీపాయ్‌మీదికి గిరాటేశాడు. నవ్వుతూ పీతాంబరాన్ని చూశాడు.

"భవనం నిధుల్ని భక్షిస్తున్న బకాసురుడు — హెడ్డింగ్ బ్రహ్మాండంగా లేదూ!"

పీతాంబరం వణుకుతూ సోఫాలో కూలబడ్డాడు. తల్లకిందులుగా పడున్న కరపత్రాన్ని ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. మెల్లిగా తలెత్తి శివరాం మొహంలోకి

ఆందోళనతో, ఆశ్చర్యంతో చూశాడు.

"ఇది....ఇది....అన్....న్యాయం....!" తడబడుతూ, ముద్దగా అన్న పీతాంబరాన్ని శివరాం తృప్తికరంగా చూశాడు.

"యస్! ఇది నిజంగా అన్యాయమే! ఈ అన్యాయాన్ని ఎదిరిస్తాం. ఓం ప్రథమంగా రేపు నీ విద్యార్థులంతా ఊరేగింపు జరుపుతారు. కరపత్రాల్ని వెదజల్లుతారు. తోరణాలూ కట్టమన్నాను. తరవాత నా శైలిలో నేను ప్రభుత్వానికి తెలియజేస్తాను...."

"నో"

"నో అంటే లాభంలేదు. నేను పలికిన ప్రతిమాటకూ 'యస్స్!' అని అరవడం నేర్చుకోవాలి నువ్వు. ఇదంతా చెప్పడం పూర్తికాకముందే నీ తోడుదొంగ గున్నేశ్వరావు ఆపకుండా 'యస్సస్సస్' అంటూ పాడుతూ వుండిపోయాడు...." శివరాం ఆగి వాచీ చూశాడు.

"లేచి వెళ్ళు. నువ్వు టేబుల్ దగ్గరికి చేరేసరికి గున్నేశ్వరావు రింగ్ చేస్తాడు. ఇద్దరి వాచీలూ సింక్రొనైజ్ చేసుకున్నాం. అరనిమిషం ఆలస్యమైతే కొంప అంటుకుంటాయని అతనికి చెప్పాను!"

పీతాంబరం వెర్రివాడిలా చూశాడు. ఉన్నట్టుండి టెలిఫోన్ మోగింది. పీతాంబరం ఉలిక్కిపడ్డాడు.

"గో!" శివరాం గర్జించాడు.

అసంకల్పితంగా పీతాంబరం లేచాడు. తాగినవాడిలా నడిచాడు. శివరాం సిగరెట్ వెలిగించాడు.

"యస్...." పీతాంబరం బోదురుకప్ప కంఠం శివరాంకి నవ్వు తెప్పించింది.

"యస్....ఉన్నాడు...."

"……………"

"నిజంగా?"

"……………"

వణుకుతున్న చేత్తో రిసీవర్ని చెవికి అదిమి రెండు నిమిషాలపాటు పీతాంబరం చెట్టులా నిలబడిపోయాడు. అతని చెయ్యి పసిపాప చెయ్యిలా వణుకుతూ కిందికి వాలింది. రిసీవర్ ప్రాణమున్నదానిలా క్రెడిల్ మీదకు పడింది. పీతాంబరం కదిలాడు. అడుసుమడిలో నడుస్తున్న వాడిలా సోఫాని సమీపించాడు కూలబడి, వెనక్కివాలి, రెండు చేతుల్తో మొహాన్ని కప్పేసుకున్నాడు.

"ఏమంటాడు నీ పార్ట్‌నర్?" శివరాం అతన్ని ప్రశ్నించాడు.

పీతాంబరం ఉలిక్కిపడి, తలెత్తాడు. ఎర్రటి కళ్ళతో పిచ్చివాడిలా చూశాడు.

"నేను అడిగినంతా ఇచ్చేయమన్నాడా? తనవాటా రెడీగావుందన్నాడా? వెళ్ళి కలెక్ట్ చేసుకొమ్మన్నాడా?" శివరాం కులాసాగా ప్రశ్నించాడు.

మెల్లిగా పీతాంబరం పెదవులు కదిలాయి........ "శి....వ....రా....మ్..... అంత.....మొత్తం........ అన్యాయం...."

శివరాం జోక్ విన్నట్టు పగలబడి నవ్వాడు. "నా అంచనా ప్రకారం మీరిద్దరూ కలిసి పధ్నాలుగులక్షల దాకా భోంచేశారు. నాలుగేళ్ళుగా స్వాహా చేసిన పధ్నాలుగు లక్షలకి చక్రవడ్డీ కట్టాను. ఇంక ఆ సొమ్ముతో వ్యాపారం చేశారుగనక, లాభం పూర్తిగా లెక్కగట్టాను. కొడుకులు ఇంజనీర్లవుతే కట్నం ఎంత గుంజవచ్చని నువ్వు కలలుకన్నావో ఆ మొత్తాన్ని,

కూతురు డాక్టరైతే, కట్నం లేకుండా కట్టుకునే కుర్రాడి ద్వారా ఆదా అయ్యే మొత్తాన్ని కలిపాను. అలాగే గున్నేశ్వర్రావుకి వచ్చే ఆదాయాన్ని కలిపాను. చిత్తు లెక్క ప్రకారం ఇద్దరి మొత్తం—నలభై దాటింది....”

“నో ఓఓఓ....ఇది దారుణం!”

“ఎందుకైనా మంచిదని రౌండప్ చేసి యాభై అనుకున్నాను. పైగా నేను విద్యాసాగర్ అవతారంతో అచ్చుకున్న యాభై వేలనీ కలపలేదు!” శివరాం నవ్వుతూ అన్నాడు.

పీతాంబరం వణుకుతూ చూశాడు. “శివరాం...... నిజంగా అంత లేదు. నా మాట....నమ్ము....ప్లీజ్....”

“గున్నేశ్వర్రావూ మొదట్లో ఇలాగే నాన్చాడు. అసలు నిజాన్ని అసలు వ్యక్తులకు ఇచ్చేస్తాననీ, నామమాత్రం ధర తీసుకుని పేపర్లకి ఇస్తాననీ చెప్పేసరికి ‘అంత వుంది!’ అన్నాడు!” శివరాం ఎగతాళిగా అన్నాడు.

“ప్లీజ....ఇది....”

“ఏమండీ! ఇలా రండి!” ఆడకంఠం పీతాంబరం గొణుగుడుకి ఆనకట్ట వేసింది. అతను అనుసరిస్తూ లేచాడు. మంత్రముగ్ధుళ్ళా కదిలాడు. కుడివేపున్న గుమ్మంలోంచీ తొంగిచూస్తున్న పీతాంబరం భార్యవేపు శివరాం చిరునవ్వుతో చూశాడు.

పీతాంబరం లోపలికి జరిగాడు. తలుపు మూసుకుంది. శివరాం మరో సిగరెట్ ముట్టించాడు....

రెండు నిమిషాల్లో కొత్త వ్యక్తిలా తనముందు ప్రత్యక్షమైన పీతాంబరాన్ని శివరాం ప్రశ్నార్థకంగా చూశాడు.

"అడిగింది ఇచ్చాక, ఆ ఇన్ ఫర్మేషన్ అంతా నాకు స్వాధీనం చేస్తావా?" ఏడుపు గొంతుతో అడిగాడతను.

"రెండు చేతుల్తో ఇచ్చేస్తాను!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"....నిజంగా? నమ్మమంటావా?"

"అసలు కాగితాలు చేతికి అందేక, చేతిరాతలూ, జిరాక్సు కాపీలూ నాకు దేనికి?"

పీతాంబరం రెండు క్షణాలు శివరాం మొహంలోకి చూస్తూ రాతి విగ్రహంలా వుండిపోయాడు.

"శివరాం....స్టూడెంట్స్....అదే........వాళ్ళ ఊరేగింపు...." పీతాంబరం నత్తి నత్తిగా అంటూ ఆగాడు.

"విద్యార్థి సంక్షేమ సమాఖ్య విద్యాసాగర్ గ్రీన్ సిగ్నల్ ఇస్తే కానీ వాళ్ళు కాళ్ళు కదపరు; కంఠాలు విప్పరు! అయితే నేను గ్రీన్ సిగ్నలు ఇవ్వకూడదంటే అరగంటలో నాకు పచ్చనోట్లకట్టలు కనిపించాలి!" శివరాం నవ్వాడు.

పీతాంబరం మళ్ళీ హిప్నటైజ్ చేయబడ్డవాడిలా తదేకంగా చూస్తూ ఉండిపోయాడు. చివరికి తెప్పరిల్లి కొలిమి తిత్తిలా శబ్దం చేస్తూ నిట్టూర్చాడు.

"అవన్నీ.... ఎక్కడున్నాయి? నువ్వు .... నీకు.... యెక్కడ యివ్వాలి?" బరువుగా అడిగాడతను.

"మరో అరగంట ఇక్కడే విశ్రాంతి తీసుకొంటాను. సుశ్శీలేశ్వర్రావు వాటా తీసుకురా! నీ వాటా కలుపు. ఇదంతా అరగంట వ్యవధిలో జరిగిపోవాలి!"

"అవి...."

"ఛీ! అవి! నువ్వు ఇచ్చాక, గంటలో నా గదిలో నీకు అప్పగించబడతాయి. వెళ్ళి త్వరగా రా! మరికొంత

చెప్పాలి నీకు! గో అండ్ కమ్. గో రన్నింగ్ అండ్ కమ్ రన్నింగ్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

పీతాంబరం నిశ్శబ్దంగా యేడుస్తూ గుమ్మంవైపు కదిలాడు....

# 5

శివరామ్ తలుపుతట్టబోతూ ఆగి, అరచేతో తోశాడు. తలుపు లోపలికి జరిగింది. శివరామ్ సూట్‌కేస్‌ని గదిలోకి తోసి, దాని వెనకే లోపలికి దూరాడు అతని కాలిమడమ తలుపుని ముందుకి తోసింది. గొళ్ళెం పెట్టకుండా లోపలి గదిలో దాక్కున్న లత గురించి ఆలోచిస్తూ అతను క్షణ కాలం అలాగే నిలబడ్డాడు.

వెనకనుంచీ అమాంతం రెండు చేతులు అతన్ని చుట్టేశాయి. అతని మొహం చిరునవ్వుతో విచ్చుకుంది. మెల్లగా వెనక్కి తిరగబోయాడు. చేతులు గొలుసుల్లా బిగుసుకున్నాయి.

"హనీ...."

"నాతో మాట్లాడకు!" లత కంఠం అతని వెనక ధ్వనించింది.

శివరామ్ నవ్వుతూ వెనుదిరగడానికి ప్రయత్నించాడు. లత ఆవేశం అతని వీపుని బలంగా నొక్కింది.

"నా కోసం యేం తెచ్చావ్?" లత చెంపతో అతని వీపు పై భాగాన్ని అదుముతూ అంది.

"వెనుకనుంచీ వదిలేసి, ముందునుంచీ బంధిస్తే గానీ చెప్పను!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

చేతుల్ని ఒకసారి యింకొంచెం బిగించి, నవ్వుతూ లత అతన్ని వదిలేసింది. శివరామ్ గిరుక్కున వెనక్కి తిరిగాడు. రెండు చేతుల్తో బొమ్మను ఎత్తినట్టు అతని పై

కెత్తాడు. కాలితో సూట్ కేసుని నిర్లక్ష్యంగా తోస్తూ సోఫాని సమీపించాడు. లతని సోఫామీద పడేసి, ఆమె తలవేపు కూచున్నాడు. లత వెల్లకిలా, పాములా పాకుతూ పైకి జరిగింది. ఆమె తల అతని ఒళ్ళో సెటిల్ అయ్యింది. ఆమె కళ్ళు కలువపువ్వుల్లా అతని మొహం లోకి చూశాయి.

"చెప్పు డార్లింగ్....ఏం తెచ్చావ్?"

"ఏమిటో నీకు తెలుసు. ఎంతో నీకు తెలీదు. అడుగు!"

"ఆల్ రైట్. ఎంత?"

"యాభై లక్షల్ని ఇంకా తక్కువ అక్షరాల్లో చెప్పు చూద్దాం!"

"అరకోటి! నిజంగా?" లత అరిచింది.

ఆ సూట్ కేస్ మీద ఒట్టు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

లత తటాలున లేచి కూచుంది. శివరామ్ తటాలున ఆమె వొళ్ళో తల పెట్టుకొని పడుకొన్నాడు. లత దీపాల్లాంటి కళ్ళతో అతని కళ్ళల్లోకి వెలుగులు చిమ్మింది.

"చాదరి దగ్గర సి.సి.గా నా చేత యెంతో రాయించావు. కథంతా నాకు తెలిసిపోయింది. కథ—అంతేనా, ఇంకా వుందా?" లత నవ్వుతూ అడిగింది.

"ఎందుకు లేదు?" శివరామ్ ఎదురుప్రశ్న వేశాడు. "సువర్చల సాయంతో కాలేజీలో ఇన్నాళ్ళుగా వసూలు చేయబడ్డ బిల్డింగ్ ఫండ్ వివరాలు సంపాయించాను..."

"నిజంగా? చాదరితో 'నా పదవులు నా కున్నాయి' అని నువ్వు అన్నప్పుడు ఊహించలేకపోయాను!"

శివరామ్ చిన్నగా నవ్వాడు. "తర్వాత స్టూడెంట్స్

తయారు చేసినట్టు కరపత్రాల్ని తయారు చేయించాను. 'భవనం నిధుల్ని భక్షిస్తున్న బకాసురుడు!' ఇదీ హెడ్డింగ్. పీతాంబరం దిగంబరంగా మారిపోయి ఏడుస్తూ కాళ్ళబేరానికి వచ్చాడు. డైరెక్టుగా అతనికి చెప్పకుండా అతని తోడుదొంగ గున్నేశ్వర్రావు ద్వారా చెప్పించాను. ఇద్దరూ కలిసి, వడ్డీలూ, లాభాలూ కలిపి మొత్తం సమర్పించారు!"

"డార్లింగ్ ...."

"యస్?"

"పిల్లల కోసం వసూలైన బిల్డింగ్ ఫండ్ని వాళ్ళు కాజేశారు. వాళ్ళ నుండి నువ్వు వడ్డీతోసహా కొట్టేశావు. మరి....పిల్లలకి....అన్యాయం...."

"జరగదు!" శివరామ్ అడ్డుతగిలాడు.

లత ఆశ్చర్యంగా చూసింది. ఆమె కనుబొమలు అందమయిన కొత్త ప్రశ్నార్థకంగా తయారయ్యాయి.

"డార్లింగ్....ఎట్లా? మళ్ళా ఫండ్కి వాపసు చేస్తావా?" లత అమాయకంగా అడిగింది.

శివరామ్ గొల్లున నవ్వాడు. "నా తరపున ప్రిన్సిపాల్ పీతాంబరం, అతని గురుడు గున్నేశ్వర్రావూ జాయింటుగా, గుట్టుచప్పుడు కాకుండా వాపసు చేస్తూ బ్యాంకులో కట్టేస్తారు...."

"ఈజిట్?! డార్లింగ్, యూ ఆర్ డార్లింగ్!" లత ఉద్రేకంతో అంది. "ఈసారి బకాసుర వధ చేశావ్!"

"ఇంకా విను: బ్యాంకులో జమ చేశాక గున్నేశ్వర్రావు తన గౌరవపదవికి సగౌరవంగా, మర్యాదగా రాజీనామా ఇస్తాడు. ప్రిన్సిపాల్ చౌదరిని కమిటీ త్రోసి

డెంటుగా చేస్తాడు. శివ మీటింగ్స్ యేర్పాటు చేసి డమ్మీగా రూపొందుతాడు. ఈ క్షణం నుంచీ మనుషుల్లా కాకుండా—మీటింగ్ జరక్కుండా, అజెండా తయారవకుండా, తీర్మానాలు ఆమోదించబడకుండా పైసా కూడా ఖర్చు చేయరు! ఈ షరతులన్నీ చక్కగా పీతాంబరానికి నూరిపోశాను ...”

“అంతేనా?” లత అడ్డు తగిలింది.

“ఇంకొంచెం వుంది....!” శివరామ్ నవ్వుతూ అన్నాడు.

లత ప్రశ్నార్థకంగా చూసింది. శివరామ్ తలని ఆమె వొళ్ళో నొక్కుతూ అలసటగా ఆవులించాడు.

“హనీ, ఈసారి నువ్వొక అడ్వెంచర్ చేయబోతున్నావ్!”

“నిజంగా? ఏమిటది....?” లత హుషారుగా అరిచింది.

శివరామ్ రెండు అరచేతుల్లో ఆమె ముఖాన్ని యిరికించి పట్టుకొన్నాడు.

“నా తరఫున డిటెక్టివ్ టెంపోకి కథ చెప్తావ్!”

లత నమ్మలేనట్టు చూసింది. శివరామ్ మళ్ళీ ఆవలించే ప్రయత్నం చేశాడు. లత బుంగమూతి పెట్టింది. శివరామ్ నవ్వుతూ యేదో చెప్పబోయాడు.

లత తల కటాలున కిందికి వొంగింది. మాట్లాడ్డానికి వీల్లేకుండా శివరామ్ నోరు నొక్కేసింది....

(‘శివరామ్ అడ్వెంచర్స్ సీరిస్’లో ఇది 10వ నవల.)

సీరియల్

# రాక్షసహేల

వాణిశ్రీ

(గత సంచిక తరువాయి)

"చస్తే యేమిటి?"

"కోపం వద్దు నందితా! ప్లీజ్ ఎక్స్‌క్యూజ్ మీ! ఐ యామ్ వెరీ వెరీ సారీ!"

శ్రీనాథ్ ఆమె దగ్గరగా వచ్చాడు.

ఆమె భుజంమీద చెయ్యి వేశాడు. విసిరికొట్టింది.

"నన్ను ముట్టుకోకు."

"మొన్న మొన్నటివరకు మనం నగ్నంగా ఆ బెడ్ మీద సుఖపడ్డాం. అదంతా నీకు గుర్తురావడంలేదా? నేను ఆ మధురక్షణాలు మరువలేకుండా వున్నాను నందితా! నువ్వు గుర్తుకువచ్చి పిచ్చెక్కిపోతోంది."

శ్రీనాథ్ ఆమెను కౌగలించుకొని బలవంతంగా ముద్దు పెట్టుకున్నాడు.

నందిత అతన్ని విసురుగా నెట్టింది.

అతను అది ఆపుకోలేక వెల్లకిలా పడ్డాడు.

అతనికి కోపం ముంచుకొచ్చింది. ప్రతిమాలే కొద్దీ నెత్తిన యెక్కుతుందే. దీన్ని యిలా కాదు అనుకున్నాడు.

"నువ్వు నా వైఫ్‌వి. నాతోపాటు రా!" అంటూ ఆమె జబ్బ పట్టుకుని విసురుగా రూమ్‌లో నుంచి లాక్కొ-

చ్చాడు!

"యూ! ఫూల్. గెటౌట్" అని కేకలు పెట్టింది నందిత.

నందిత అరుపులకు రాజేంద్రప్రసాద్ వచ్చాడు. పెద్ద గొడవ అయింది. మామా, అల్లుడు మాటకి మాట అను కున్నారు.

శ్రీనాథ్‌ని నౌకర్లతో బలవంతంగా బైటకు పంపిం చాడు రాజేంద్రప్రసాద్.

"నా కూతురికి యిష్టం లేకుండా మీద చెయ్యి వేశా వంటే సహించను. నీ అంతు చూస్తాను" అని వార్నింగ్ ఇచ్చాడు.

శ్రీనాథ్ అవమాన భారంతో అక్కడ్నుంచి బైట పడ్డాడు.

అతని ముఖం చూసే తెలుసుకొన్నాడు కిరణ్ కథ అడ్డం తిరిగిందని.

శ్రీనాథ్ జరిగిందంతా చెప్పాడు.

"డోంట్ వర్రీ! టైమ్ విల్ సాల్వ ద ప్రాబ్లమ్స్" అన్నాడు.

"నందిత మళ్ళీ నన్ను రానిస్తుందంటావా?" విచా రంగా అడిగాడు శ్రీనాథ్.

"చచ్చినట్టు రానిస్తుంది. ఇప్పుడు తండ్రి అండ వుంది కాబట్టి పొగరుగా బిహేవ్ చేస్తోంది. రేపు వాడు చచ్చాక నువ్వే గతి" అన్నాడు కిరణ్.

శ్రీనాథ్ ఆశ్చర్యంగా చూశాడు.

"అతను అప్పుడే చావడం యేమిటి? దున్నపోతులా వుంటేను" అన్నాడు.

కిరణ్ నవ్వాడు.

"అలాగే వుంటారు. హార్ట్ ఎటాక్‌తో పోరి అంటారు. అంతా మినిట్స్‌లో జరిగిపోతుంది. అంతలావు శరీరంలో యెన్ని రోగాలు కాపురం చేస్తున్నాయో యెవరికి తెలుసు?"

"ఏమోరా! వాడు చచ్చి, నంటత నాకు దక్కినప్పటి సంగతి కదా! అది ఎన్నేళ్ళకో."

"నువ్వు వర్రీకాకు. వాడు రోగంతో చావకపోయినా మర్డర్ చేయబడతాడు."

శ్రీనాథ్ నోరు తెరిచాడు.

"ఎవరు మర్డర్ చేస్తారు?"

"ఎవరో యెందుకు? ఆయనగారి బామ్మర్ది లేడూ దశరథ్. వాడే మర్డర్ చేసేస్తాడు. స్వార్థానికి అడ్డు తగిలితే అంతే మరి" అన్నాడు కిరణ్.

"వాడు తొందరగా మర్డర్ చేస్తే బాగుండును" అన్నాడు శ్రీనాథ్.

"పోనీ నువ్వే మర్డర్ చేసెయ్యరాదూ?" నవ్వుతూ భుజం చరిచాడు కిరణ్.

"అమ్మో! నేనా!" అని గుండెమీద చెయ్యి వేసుకున్నాడు.

"జోక్ చేశాన్లేరా! నీ గుండె ధైర్యం నాకు తెలీదూ?"

"వాడు చావడం సంగతి తర్వాత గాని, నే నిప్పుడు యేం చెయ్యాలి?...." దీనంగా అడిగాడు శ్రీనాథ్.

"ఏం చెయ్యడం యేమిటి? నీ కిష్టమయిన ఇండస్ట్రీ మొదలుపెట్టు. లైసెన్సులు అవీ తెచ్చుకోవాలిగా!"

"నా కొందరలా వుంది. డబ్బు కావొద్దూ!" అన్నాడు

శ్రీనాథ్.

"నీ ఖాండలా వుంది. బ్యాంక్‌లో డబ్బు పెట్టుకొని, డబ్బు, డబ్బు అంటా వేమిటి?"

"బాంక్‌లో వుందా?"

"అవున్రా వెధవాయ్! మీ మామ నీ పేరుతో పది లక్షలు బ్యాంక్‌లో వేశాడు. అది తియ్యాడం ఎవరి వల్లా కాదు. దర్జాగా ఖర్చు పెట్టుకో" అన్నాడు.

శ్రీనాథ్ ముఖంలోకి వెలుగొచ్చింది

"మైగాడ్" అని ఆశ్చర్యపోయాడు.

ఇప్పుడతనిలో వర్రీ తగ్గిపోయింది.

## 31

స్రవంతి ఫైనాన్స్ కంపెనీ ఆఫీసులో మేనేజర్ ఎదుట కూర్చుని వున్నాడు ఆర్. కె. రాధ.

అతను చాలా వర్రీడ్‌గా వున్నట్లు చూడగానే తెలిసి పోతోంది. నల్లగా. దుమ్మొదలా వున్న అతని కళ్ళు ఎర్రగా నిప్పుల్లా మెరుస్తున్నాయి. ఏ.సి. రూమ్‌లో గూడా అతనికి చెమట్లు పడుతున్నాయి. మేనేజర్ రాఘవన్‌వైపు దీనంగా చూస్తున్నాడు. కాని రాఘవన్ ఎటో చూస్తున్నాడు.

"ప్లీజ్ రాఘవన్‌గారూ! మీరీ సహాయం చెయ్యకపోతే చచ్చిపోతాను" మరొకసారి అన్నాడు ఆర్. కె. రాధ.

"ఐయామ్ సారీ రాధాగారూ! నా చేతుల్లో ఏమీ లేదు. మా పార్ట్‌నర్ని కలుసుకోండి. ఆయన ఒప్పుకుంటే నాకేం అభ్యంతరము లేదు. ఎందుకంటే డబ్బంతా ఆయనదే. నాది చాలా తక్కువ. నామ్‌కే వాస్తే"

అన్నాడు మేనేజర్.

"ఆయనా?... ఆయన్ని కలుసుకున్నా ఒకటే. లేక పోయినా ఒకటే. ఏదయినా చేస్తే మీరే చెయ్యాలి" అన్నాడు ఆర్. కె. రాధ.

"నేనేం చెయ్యాలేనండి" అన్నాడు రాఘవన్.

"ప్లీజ్! పరిస్థితి అర్థం చేసుకోండి" ఆర్. కె. రాధ ప్రాధేయపడసాగాడు.

"చూడండి రాధాగారూ! ఒకటి కాదు రెండు కాదు. పాతిక లక్షలు. వడ్డీతో ముప్పై లక్ష లయ్యింది."

"నేను కాదనడంలేదు. సగం ఇస్తానంటున్నాను. మిగతా సగానికి కొన్ని యేరియాలు మిగిలివున్నాయి. మీకు భయం యేమిటి?" ఆర్. కె. రాధ మేనేజర్ని ప్రసన్నం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

తెలుగు చలనచిత్రసీమలో ఆర్. కె. రాధ ఇప్పుడు పెద్ద ప్రొడ్యూసర్. పాతిక సంవత్సరాలుగా ఫీల్డులో వుంటున్నాడు. బాయ్‌గా జీవితం మొదలుపెట్టి అంచె లంచెలుగా ఎదిగి ప్రొడ్యూసర్ అయ్యాడు. పదేళ్ళుగా పది బడ్జెట్ పిక్చర్స్ ప్రొడ్యూస్ చేశాడు. కొన్ని హిట్ అయ్యాయి. కొన్ని యావరేజ్‌గా పొయ్యాయి. రెండు మూడు ఫ్లాపులు అయ్యాయి.అయినా ఇంత ఇరకాటంలో అతను ఎప్పుడూ పడలేదు.

పది పిక్చర్స్ తీసినా పదిలక్షలు సంపాదించడం గగనమైపోయింది. అటువంటిది ఇటీవల ఒక్క పిక్చర్ తీసి పాతిక లక్షలు మూటగట్టిన వాళ్ళున్నారు. ఫీల్డులో చిత్రమైన మార్పు ఉప్పెనలా వచ్చిపడింది. బడ్జెట్ సినిమాలు మూలపడ్డాయి. మరీ నలుగురు హీరోలుంటే

చాలు జిల్లా డిస్ట్రిబ్యూటర్స్ అడ్వాన్సులు ఇచ్చి ఎగబడ్డారు. కోటి రూపాయలైనా కొనుక్కుపోసాగారు.

ఆర్.కె. రాధ కూడా హీరో రారాజు కాల్షీట్స్ కోసం క్యూలో నిల్చున్నాడు. అర్నెల్ల క్రితం అతనికి కాల్షీట్స్ దొరికాయి. రారాజు ఇరవై లక్షలు తీసుకున్నాడు. ఆ రేంజిలోనే డైరెక్టర్, హీరోయిన్‌కి నాలుగు, విలన్‌కి నాలుగు, అన్నీ లక్షలే. హీరో వెంట పదిమంది వందిమాగధులు. వాళ్ళకి హీరోతో పాటు సకల సౌకర్యాలు. విమానం ఛార్జీలు, ఫైవ్ స్టార్ హోటల్లో గదులు. హీరోయిన్‌తో పాటు చెలికత్తెలు, అమ్మ, చెల్లెళ్ళు, తమ్ముళ్లు, వాళ్ళందరికీ ప్రొడ్యూసర్ ఖర్చుతో తిండి తిప్పలు. పిక్చర్ పూర్తికావొచ్చింది. ఖర్చు తొంభై లక్షలు తేలింది.

“ఆర్.కె. రాధ దురదృష్టం. కొన్ని సినిమాలు ఫ్లాప్ అయ్యేసరికి జిల్లా డిస్ట్రిబ్యూటర్లు మద్రాస్ రావడం మానేశారు. అడ్వాన్సులు వదులుకున్నారు.

రారాజు కాదు వాడి తాత వున్నా అంత రేటు పెట్టి పిక్చర్ కొనేవాళ్ళు మార్కెట్‌లో దొరకలేదు. అడ్వాన్సులు ఇచ్చిన వాళ్ళు కొందరు గుండె ధైర్యంతో వచ్చారు. కొందరు పత్తాలేరు.

పిక్చర్ రిలీజ్ చెయ్యడం ఎట్లా అని ఆర్.కె. రాధను మనోవ్యాధి పట్టుకుంది.

ముఖ్యంగా రోజులు గడిచేకొద్దీ ఫైనాన్స్‌మీద వడ్డీ పాపంలా పెరిగిపోతోంది. హీరో, హీరోయిన్, విలన్ వగైరాల చుట్టూ తిరిగాడు రేటు తగ్గించమని. ఇదిగో అదుగో అని చుట్టూ త్రిప్పుకోసాగారు. ఒకప్పుడు వాళ్ళంతా ఛాన్సులకోసం అతని చుట్టూ తిరిగినవారే,

అయితే నేం ఇప్పుడు పరిస్థితి తారుమారైంది.

ఆర్. కె. రాధ సంపాదించుకున్నదంతా పెట్టినా పిక్చర్ రిలీజ్ అయ్యేపరిస్థితి లేదు. ఆర్నెల్లు నరకం అనుభవించాడు. ఇక లాభం లేదని నష్టానికి పిక్చర్ రిలీజ్ చేసెయ్యాలని నిశ్చయించుకున్నాడు. కాని ఫైనాన్స్ గొంతు పట్టుకుంది.

ముప్పైలక్షలు బాకీ తేలింది. పదిహేనురకు చెల్లించే ఏర్పాటు జరిగింది. మూడు జిల్లాలు అడ్వాన్సులు ఇచ్చిన వాళ్ళు వదిలేశారు. కొత్తగా ఎవరూ ముందుకు రావడం లేదు.

ఒక పెద్ద కంపెనీతో ఫ్రీ డిస్ట్రిబ్యూషన్ మాట్లాడు కున్నాడు. అదీ పెద్ద అబ్లిగేషన్ మీద.

కాని మొత్తం డబ్బు చెల్లించనిదే పిక్చర్ రిలీజ్ చెయ్యడానికి ఫైనాన్సియర్ ఒప్పుకోడు.

అందుకే ఆర్. కె. రాధ తిప్పలు.

"రాఘవన్ గారూ ఇంత దరిద్రం ఎప్పుడూ లేదండి. పొరపాటున ఊబిలోకి దిగాను. బడ్జెట్ పిక్చరొకటి ప్లాన్ చేసి వుంటే ఇలా జరిగేది కాదు."

రాఘవన్ పరధ్యానంగా తల వూపుతున్నాడు.

"పులిని చూసి నక్క వాతపెట్టుకున్నట్లుంది నా పని. అందరూ హీరోలతో లక్షలు లక్షలు వెనకేసుకుంటు న్నారని దురాశకు పోయాను. అసలు తెలుగు సినిమాకు కోటిరూపాయల బడ్జెట్ ఏమిటండీ నా బొంద. హిందీ, ఇంగ్లీషు అయితే ఫరవాలేదుగాని."

రాధ అక్కసు వెళ్ళబోసుకుంటున్నాడు.

బైట ఎండ తగ్గింది. లోపల కూర్చున్న రాధకు కాలం తెలియడంలేదు. రాఘవన్ని ప్రసన్నం చేసుకోవ

డానికి ఫీల్డులో వున్న లొసుగులన్నీ ఏకరువు పెడుతున్నాడు. అవేవీ రాఘవన్‌కి తెలియనివి కావు. గత్యంతరం లేక 'వూఁ' కొడుతున్నాడు.

ఈలోపల రాధ మేనల్లుడు కుమార్ వచ్చాడు. ఇద్దరూ బైటకెళ్ళారు. కాసేపు గుసగుసలాడుకున్నారు.

కుమార్ రాఘవన్ దగ్గరికి వెళ్ళాడు.

"సార్! మీరు తాజ్ కోరమాండల్‌కి ఒకసారి రావాలి. సాయంకాలం ఏడుగంటలకి, తప్పకుండా."

రాఘవన్ ముఖం ప్రసన్నమైంది.

"ఏమిటి విశేషం?"

"విశేషమే. చిన్న గెట్ టుగెదర్. మన పిక్చర్లో హీరోయిన్ మాలిని వస్తుంది."

"ఈజిట్?" అన్నాడు రాఘవన్.

అతని ముఖం స్విచ్ వేసిన బల్బులా వెలిగింది.

కుమార్ తల వూపాడు.

"నేను మీకోసం వెయిట్ చేస్తుంటాను" అన్నాడు.

రాఘవన్ "సరే" అన్నాడు.

మాలిని అతని ఫేవరెట్ స్టార్. ఆమె అందం అతనికి ఇష్టం. ఆమె గ్లామర్ అతనికి కల్లో కనిపిస్తుంటుంది. ఆమెను దగ్గరగా చూడ్డంకోసమే ఎన్నోసార్లు షూటింగులకు హాజరయ్యేవాడు. అయితే అతనికి ఆమె పరిచయ భాగ్యం కలగలేదు.

అతనికి చాలా సంతోషంగా వుంది.

సరిగ్గా ఏడుగంటలకు అతను తాజ్ కోరమాండల్ మెయిన్ గేటు దగ్గరున్నాడు. అతని కారు నెమ్మదిగా అప్ ఎక్కుతోంది. తల బైటపెట్టి చూశాడు.

కుమార్ కనిపించాడు.

కారు ఆగింది.

"మీకోసం ఎదురు చూస్తున్నారు."

కుమార్ నవ్వాడు.

ఇద్దరూ లిఫ్ట్‌లో పైకి వెళ్ళారు.

గదిలో ఎవ్వరూ లేరు.

"ఎవరూ లేరేం?" ఆశ్చర్యంగా అడిగాడు రాఘవన్.

"పార్టీ మీ ఒక్కడికే."

"మరి మాలిని."

"వస్తుంది. ఇప్పుడే ఫోన్ చేశాను. బయల్దేరారని చెప్పారు. మీరు కూర్చోండి. నేనామెను రిసీవ్ చేసుకుంటాను."

రాఘవన్ తలవూపాడు.

కుమార్ వెళ్ళిపోయాడు.

అరగంట తర్వాత తలుపు నెమ్మదిగా తెరుచుకుంది. జాస్మిన్ పరిమళం గదంతా వ్యాపించింది.

రాఘవన్ కళ్ళముందు మెరుపుతీగ ప్రత్యక్షమైంది.

"వీరు రాఘవన్‌గారు. స్రవంతి ఫైనాన్సియర్స్" కుమార్ పరిచయం చేశాడు.

"నమస్తే."

మాలిని రెండు చేతులు జోడించింది.

రాఘవన్ లేచి నిల్చున్నాడు అబ్బురపాటుతో. నమస్తే చెప్పాడు.

"కూర్చోండి" అంది మాలిని.

అందరూ కూర్చున్నారు.

"రాఘవన్‌గారు తెలియక పోవడం ఏమిటి?" అంది మాలిని.

రాఘవన్ వుబ్బితబ్బిబ్బు అయ్యాడు.

మాలినికి ముఖ్ఫై యేళ్ళుంటాయి. కత దశాబ్దంగా సూపర్ స్టార్. ఇప్పుడు ఆమెకు పోటీ ఎక్కువయింది. నెలకో హీరోయిన్ మళయాళం, అరవం, కన్నడం, హిందీ ఫీల్డుల నుంచి తెలుగు తెరకు పరిచయమౌతు న్నారు. ఇదివరకులా ఆమెకు బుకింగ్స్ లేవు. తన స్థానాన్ని నిలబెట్టుకోవాలని తపన పడుతోంది.

ఆమె నటించిన కొన్ని సినిమాలు ఫ్లాప్ కావడంతో, నిర్మాణంలో వున్న సినిమాలు ఆగిపోవడం మనసుకి క్షోభ కలిగించింది. రాధ సినిమా రిలీజ్ అయి హిట్ అయితే తనకు మళ్ళీ గ్లామర్ పెరుగుతుందని ఆశపడింది. కాని అది ఫైనాన్సియర్ చేతిలో చిక్కుకుని వుందని తెలిసి తన వంతు కృషి చేయడానికి ప్రయత్నం చేస్తోంది. రాఘవన్‌కి తనంటే అభిమానమని విన్నప్పుడు ఆమెకు సంతోషం కలిగింది. తారలకు ఫైనాన్సియర్స్ ఫాన్స్‌గా వుంటే ఎంతో లాభం వుంది.

మాలినికి వయసు మళ్ళుతున్నా బుకింగ్స్ లేక పోయినా రాఘవన్ దృష్టిలో ఆమె అందాల అప్సరసే. అతని ఆరాధ్య కథానాయికే

రాఘవన్ తనివితీరా ఆమె అందాన్ని కళ్ళతో కె ఆరాధిస్తున్నాడు.

కుమార్ తెచ్చిన రాయల్ సెల్యూట్ విస్కీ ఫుల్ బాటిల్ ఖాళీ అయింది. అందులో కుమార్ కొంచెం తీసుకున్నాడు. అధిక భాగం రాఘవన్ లాగించాడు. మాలిని అతనితో పోటీపడింది.

"రాఘవన్ గారూ, రాధాగారి పిక్చర్ యెప్పుడు రిలీజు చేయిస్తున్నారు?" అడిగింది మాలిని అతన్ని ఓర

కంఠం చూశా.

రాఘవన్ వెంటనే సమాధానం చెప్పలేదు. మత్తులో వున్నా అతని మనసు షార్ప్‌గానే వుంది.

"ఎలాగండీ ముఫ్పై లక్షలుంది బాకీ" అన్నాడు.

"ఫిఫ్టీ పర్సెంట్ పేమెంట్ చేస్తాం సార్!" అన్నాడు కుమార్.

ఆ మాట కొత్తది కాదు, రాధ చెప్పిందే.

"కుమార్ గారూ! నేను వారితో మాట్లాడి ఎరేంజి చేస్తాగదా!" అంది మాలిని.

కుమార్ సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

మాలిని లోపల బోల్టు పెట్టేసి వచ్చింది.

రెండు రోజుల తర్వాత "రారాజు శపథం" ఆగస్టు పదిహేను రిలీజ్ అని పేపర్లో పడింది.

ఆ రోజు ఆగస్టు ఏడు.

కిరణ్ టెలిఫోన్ రిసీవర్ యెత్తి నెంబర్ డైల్ చేశాడు.

"రాజేంద్రప్రసాద్ హియర్!...." అని వినిపించింది.

రిసీవరు విజయ చేతికి యిచ్చి మాట్లాడమని సైగ చేశాడు.

"సర్, నేను రీటాని మాట్లాడుతున్నాను. స్రవంతి ఫైనాన్స్ నుంచి."

"చెప్పు యేం కావాలి?" విసుగ్గా వినిపించింది అతని కంఠం.

"ఒక ముఖ్యమైన విషయం మీకు చెప్పాలని ఫోన్ చేశాను సర్."

"ముఖ్యమైన విషయమా?"

"యస్, సర్!"

"చెప్పు ఏమిటో?"

"మన కంపెనీ ఆర్. కె. రాధ అనే ప్రొడ్యూసర్ పిక్చర్‌కి పాతిక లక్షలు ఫైనాన్స్ చేసింది. వడ్డీతో కలిపి ముప్ఫై లక్షలు అయింది. అతని పిక్చర్ 'రారాజా శపథం' ఆగస్టు 15 రిలీజ్ కాబోతూ వుంది."

"అయితే యేమిటి?"

"అదే చెబుతున్నా సర్! ఆర్. కె. రాధ మనకు రావాల్సిన బాకీ పూర్తిగా చెల్లించలేదు. పదిహేను లక్షలు మాత్రమే పేమెంట్ చేశాడు."

"బాలన్స్ రిలీజ్ లోపల చేస్తారేమో?"

"లేదు సర్! వైజాగ్, ఈస్టు గోదావరి జిల్లాలమీద రాయల్టీ రాసిస్తున్నాడు."

"రాయల్టీ యేమీ రాకపోతే?"

"ఏమో సర్. అది మీరు రాఘవన్‌ని అడిగి తెలుసుకోవలసిన విషయం."

"వాడు యేమైనా లాలూచీ పడ్డాడా?"

"లేకపోతే రిలీజ్‌కి యెలా ఒప్పుకుంటాడు సర్?...."

"సరే, ఇప్పుడే వాడి సంగతి తేలుస్తా."

"మీరు సాయంకాలం లోపల రండి! ఎగ్రిమెంట్స్ టైప్ చేయిస్తున్నారు."

"సరే!"

"మరొక సంగతి. హీరోయిన్ మాలిని, రాఘవన్ తాజ్ కోరమాండల్లో మొన్న రాత్రంతా గడపారని తెలిసింది."

"ఊఁ...." అన్నాడు రాజేంద్రప్రసాద్.

విజయ రిసీవర్ క్రెడిల్ చేసింది.

కిరణ్ మరొక నెంబరుకి డైల్ చేశాడు.

"రాజేంద్రప్రసాద్ ఆఫీసుకు వస్తున్నాడు. వాళ్ళిద్దరికీ యేం జరిగిందో విని నాకు చెప్పాలి. కే. కే." అన్నాడు.

"వాళ్ళిద్దరూ యిప్పుడు కొట్టుకు చస్తారు" అని నవ్వాడు కిరణ్.

చెప్పా చెయ్యకుండా వూడిపడ్డ రాజేంద్రప్రసాద్ ని చూసి స్టాఫ్ కంగారు పడ్డారు స్రవంతి ఫైనాన్స్ కంపెనీలో. అతను యెప్పుడో గాని ఆఫీసులోకి అడుగు పెట్టడు.

రాఘవన్ బిత్తరపోయాడు.

లేచి నిల్చున్నాడు.

"కూర్చో" అన్నాడు రాజేంద్రప్రసాద్ కరుగ్గా.

రాఘవన్ ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు. అతనికి లోలోపల అదురుగా వుంది. తను పదిహేను లక్షలు రిస్క్ చేస్తున్నాడు. రారాజు శపథం రిలీజ్ అయిన తర్వాత ఓవర్ ఫ్లో రావచ్చు, రాకపోవచ్చు. అదంతా డిస్ట్రిబ్యూట్ చేస్తున్న కంపెనీదయు. అటువంటి రిస్క్ ప్రొడ్యూసర్ కి తప్పనిసరి కావచ్చుగాని ఫైనాన్సియర్ కి కాదు. అటువంటిది తను రిస్క్ చేస్తున్నాడు. ఆ విషయం ముప్పాతిక వంతు పార్టనర్ అయినటువంటి రాజేంద్రప్రసాద్ కి చెప్పాల్సింది. కాని తను చెప్పలేదు. ఆయన పట్టించుకోడు మామూలుగా. అదే ధైర్యంతో ఒప్పుకున్నాడు.

"ఆర్.కె. రాధ పిక్చర్ రిలీజ్ చేస్తున్నాడటగా" అడిగాడు రాజేంద్రప్రసాద్.

"అవును. ఆగస్టు పదిహేను" చెప్పాడు రాఘవన్ ఆత్రపడుతూ.

"ట్యూ ఎంత వుంది?"

"ముప్పై!"

"పేమెంట్ చేశాడా?"

"పదిహేను చేశాడు."

"బాలన్స్ రిలీజ్ లోపల చేస్తాడా?"

రాఘవన్ గుడ్లు తేలేశాడు.

"హైలాగ్, ఈస్టు మనకి...."

రాజేంద్రప్రసాద్ అడ్డు వచ్చి "హైలాగ్, ఈస్టు అంటావేమిటి?" అన్నాడు.

"ఆ జిల్లాలు ఎవరూ కొన్లేదు. రాయల్టీ మనకి వస్తుంది బాకీ తీరేవరకు. ఆ విధంగా అగ్రిమెంట్ రాసి స్తున్నాడు" చెప్పాడు రాఘవన్.

"నాన్సెన్స్. ఆ రిస్కు మనకెందుకు?"

"మరేం చేస్తాం."

"మతి లేకుండా మాట్లాడుతావెందుకు రాఘవన్? బాకీ తీరకుండా పిక్చర్ రిలీజ్ చెయ్యనిస్తాడా ఏ ఫైనాన్షియర్ అయినా?" గట్టిగా అన్నాడు రాజేంద్ర ప్రసాద్.

"అతను బాకీ తీర్చేవాడే. కాని యిప్పుడు స్లంప్ వుంది. అతను బాకీ తీర్చే పరిస్థితిలో లేడు. నిండా మునిగాడు."

"వాడితో పాటు మనమూ మునగాలా?"

"అలా అని ఎవరన్నారు? కొంచెం రిస్కు తీసుకోవాలి. అంతే."

"మనకేం ఖర్మ? బాకీ తీర్చేసి పిక్చర్ రిలీజ్ అవ్వ

తుంది. దట్సాల్. రూపాయలు ఫ్యాక్టరీలో అచ్చు కొట్టడం లేదు రాఘవన్. నిన్ను నమ్మి లక్షలు చేతిలో పోసినందుకు బాగా చేస్తున్నావు" నిష్టూరంగా అన్నాడు రాజేంద్రప్రసాద్.

రాఘవన్, రాజేంద్రప్రసాద్ తీవ్రంగా మాటా మాటా అనుకున్నారు.

"నేనెవర్నీ నమ్మే పరిస్థితిలో లేను మిస్టర్ రాఘవన్. నా స్వంత బావమ్మర్ది దగా చేశాడు. అల్లుడు మోసం చేశాడు. వాళ్ళకంటే నువ్వేం ఎక్కువ వాడివి కాదు" అని లేచిపోయాడు.

రాఘవన్ ఏం చెప్పినా విన్లేదు.

"నేనేం వినను. ఏ ప్రొడ్యూసరైనా ఫుల్ సెటిల్‌మెంట్ చెయ్యకుండా పిక్చర్ రిలీజ్ చెయ్యడానికి నేనొప్పుకోను. దట్సాల్" అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

రాజేంద్రప్రసాద్ నిష్క్రమించాక గాలివాన వెలిసినట్లయింది ఆఫీసులో.

స్టాఫ్ వింటున్నారనిగూడా చూడకుండా తనని దులిపి వెయ్యడం రాఘవన్‌కి తల కొట్టేసినట్లయింది.

చాలాసేపు తేరుకోలేకపోయాడు ఆ దాడి నుంచి. అసలు ఈ విషయం అతనికి ఎవరు చెప్పారో? ఎలా తెలిసిందో రాఘవన్‌కి చచ్చినా అర్థంకావడంలేదు.

ఎవరికి తెలుసు ఈ విషయం?

మాలిని?

కుమార్?

ఆర్.కె. రాధ?

వాళ్ళెవరూ రాజేంద్రప్రసాద్‌తో చెప్పే అవకాశం

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 60/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా గ్యారంటీగా అందుతాయి. ఇంకా రెండేసి నెలల కొకసారి V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి!

లేదు. మరెవరు చేరతీశారు?

స్టాఫ్‌లో ఎవరైనా తెలుసుకుని....?

రాఘవన్ ఫోన్ ఎత్తి ఆర్.కె. రాధకి డైల్ చేశాడు.

“రాధగారూ! మీరు మా పార్టనర్‌కి అగ్రిమెంట్ సంగతి చెప్పారా ఏమైనా?”

“లేదండీ చెప్పలేదే? ఏం జరిగింది?”

“ఆయనకెలాగో తెలిసిపోయింది. ఫుల్ అండ్ ఫైనల్ సెటిల్‌మెంట్ అయితేగాని పిక్చర్ రిలీజ్ కావడానికి వీల్లేదని కేకలుపెట్టి పోయాడు. ఐయామ్ సారీ రాధగారూ!”

రాఘవన్ ఫోన్ క్రెడిల్ చేశాడు. తర్వాత సీట్లో నుంచి లేచిపోయాడు.

తర్వాత

‘రారాజా శపథం’ ఆగస్టు పదిహేనున రిలీజ్ కాలేదు.

ఫైనాన్సియర్స్ కోర్టుకెళ్ళి స్టే తెచ్చారని పేపర్లో వార్త పడింది.

తన పిక్చర్ రిలీజ్ కాకుండా అడ్డుపడిన స్రవంతి ఫైనాన్స్ కంపెనీ పార్టనర్ రాజేంద్రప్రసాద్ ఇంటిపైకి గూండాలతో దాడిచేసి రాళ్ళు విసిరి అల్లరిచేసినందుకు, తాగి గొడవచేసినందుకు ఆర్.కె. రాధను పోలీసులు అరెస్టు చేశారు. తర్వాత బెయిల్ మీద విడుదలచేశారు.

## 32

ఫిలిప్స్ హోటల్లో తన ప్రైవేట్ రూమ్‌లో కూర్చుని విస్కీ తాగుతున్నాడు. రాజేంద్రప్రసాద్.

ఈమధ్య అతనికి మనశ్శాంతి కరువై రోజూ తాగుతున్నాడు. రోజూ ఇంటికి వెళ్ళేవాడల్లా మానేశాడు.

అక్కడే నిద్రపోతున్నాడు. మనిషి చాలా డీలాపడినట్లు కనిపిస్తున్నాడు. అతనికి లోకం అంతా మాయగా మోసంలా తోస్తోంది. ఎవర్నీ నమ్మడంలేదు. బి.పి. ఎక్కువై తరచుగా స్టాఫ్ మీద విసుచుకు పడుతున్నాడు.

అప్పుడు రాత్రి ఎనిమిది.

ఆర్.కె. రాధ వచ్చి క్షమాపణ కోరాడు. తన పిక్చర్ రిలీజ్ ఆగిపోయిందన్న బాధలో తాగి వచ్చి గొడవచేశానని చెప్పుతున్నాడు. దయచేసి పోలీస్ కంప్లెయింట్ విత్ డ్రా చేసుకోమని కోరాడు. తర్వాత చూద్దాంలే. వెళ్ళి రమ్మన్నాడు. అతన్ని చూస్తే ఎలర్జీగా వుంది రాజేంద్రప్రసాద్ కి.

అరగంట తర్వాత అతని పర్సనల్ అటెండర్ గోపీ. వచ్చి "సుష్మా అనే అమ్మాయి ఢిల్లీనుంచి వచ్చింది" అని చెప్పాడు.

లోపలకి పంపించమన్నాడు.

"నమస్తే ప్రసాద్ జీ!" అంది సుష్మా.

అతను ఆమెను కూర్చోమన్నాడు!

"చెప్పు ఏమిటి?" అన్నాడు.

"నేను డాన్సర్ని. నాగిన్ డాన్సు నా స్పెషల్ ఐటమ్" అంది.

అతను జవాబు చెప్పలేదు.

ఆమెను పరిశీలనగా చూశాడు. ఆమె అందం జిగేల్ మని మెరుస్తోంది. కోల ముఖం, కోటేరు ముక్కు, ప్రకాశవంతమైన పెద్ద కళ్ళు, తెల్లటి శరీరం, కొప్పు గోపురంలా పైకి పోతున్నట్లు కనిపిస్తోంది. ఆమె ముఖం పడగవిప్పిన పాములా వుంది.

సన్నగా నాజూకుగా వుంది. (ఇంకా వుంది)

